

కేసరి కుటీరం మేనేజింగ్ డైరెక్టరు శ్రీమతి కే. శారదాదేవి
గృహలక్ష్మి స్వర్ణకంకణమును బహూకరించినప్పటి చిత్రము.

# అపారమైన శక్తియుత్సాహములే మీ ప్రతిష్ఠను కాపాడగలవు

KOTHANDARAM

# అమృత

## మధురమైన పానీయము




వ్యాయామ క్రీడల్లో పాల్గొనేవారందరికీ అవసరమైన ఉత్సాహ శక్తుల్నియిచ్చే ముఖ్యసాధనం అమృత - ఆ బాలగోపాలానికి అద్భుతమైన టానిక్. సేవించడానికి తియ్యగావుండి మాంచి చురుకుదనాన్ని కల్గిస్తుంది. ఈ అద్భుతమైన పానీయం ప్రసిద్ధమైన మూలికలచేతనూ ఫల రసాలతోను తయారుచేయబడింది. అందరికి ఆత్మబంధువు లాటిది.

**కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్ మద్రాసు-14**

---

ఆంధ్రప్రదేశ్‌కు, తమిళ నాడుకు ఏజంట్లు :

సీతారామ జనరల్ స్టోర్సు, బెజవాడ, సికింద్రాబాదు, మధుర.

---

# మహిళల ఆరోగ్య రక్షణకు

## మాదీఫల రసాయనము

ఇది ముదిరిన మాదీఫలముల రసముతో తయారు చేయబడినది. గర్భిణి స్త్రీలకు కలుగు వాంతులకు (వేవిళ్లు) యిది సంజీవివంటిది. తల తిరుగుడు, వాంతులు, అరోచకము, అజీర్ణము, మలబద్ధకము, నిద్రలేమి మొదలగు జబ్బులకు వజ్రాయుధము, జ్వరవేగమును తగ్గించుటలో యీ రసాయనము పేరుపొందినది. ఇది తేనెవలె యుండి నోటికి రుచిగను యింపుగను నుండును.

3 ఔన్సుల బుడ్డి రు. 1-25 న.పై.

## గర్భరక్షక

స్త్రీలు బలహీనులగుటచేత గర్భము ధరించిన పిమ్మట పెక్కు రుగ్మతల పాలగుచున్నారు. ముఖ్యముగ వీరలకు గర్భస్రావము, అకాల ప్రసవము, అప్పుడప్పుడు కడుపునొప్పి, నడుము నొప్పి, రక్తహీనము, శరీరమందు నీరుచేరుట, బలహీనము, అలసట, ఆయాసము, అజీర్తి, మలబద్ధకము మొదలగు జబ్బులు కలుగుచున్నవి. ఈ 'గర్భరక్షక' సేవించిన పై జబ్బులు రాకుండు టయే గాక ప్రసవించువరకును శరీరము మంచి ఆరోగ్యస్థితి గలిగియుండి నిండుమాసములు గర్భము ధరించి సుఖముగ ప్రసవించెదరు.

3 ఔ॥ రు. 3-10   6 ఔ॥ రు. 5-50

## క్షీరబలా తైలం

స్త్రీలకు ఋతు దోషముచే గల్గు వాత వ్యాధులు, పార్శ్వపు తలనొప్పులు, తలపోటు, గర్భవాతము, శరీరము బలిసియుండుట, మూర్ఛ, అపస్మారవ్యాధులు, క్షయవ్యాధి, నరముల బల హీనత, యీ తైలముతో అభ్యంజన మొనర్చిన నివర్తించును.

6 ఔ॥ల బుడ్డి రు. 3-0

## సౌభాగ్య శొంఠి

### బాలింత లేహ్యము

ప్రసవానంతరమున స్త్రీలకు బాలింతకారమును ఒక ఘాటు ఔషధమును యిచ్చు ఆచారము మన దేశమున చిరకాలముగ నున్నది. అయితే ఈ కారమును లెక్కలేనన్ని పచారిదుకాణపు సామానులతో తయారుచేసి యిచ్చుచున్నారు. ఇందు కలియు వస్తువుల పరిమాణమును, పదార్థజ్ఞానమును పాటింపక మందును తయారు చేయుదురు. ఈ కారము వారికి వేడిచేసి అనేక రుగ్మతలు సంభవించుచున్నవి. ఈ సౌభాగ్య శొంఠిని వాడిన ఆరోగ్యము చెడక తల్లియు బిడ్డయు సుఖముగ నుండగలరు. తల్లికి సమృద్ధిగ పాలుపడును.

బుడ్డి రు. 2-0

## ప్రమేహాంతకం

(తెల్లబట్ట వ్యాధికి)

అనేక కారణములవలన స్త్రీలకు గర్భాశయము నుండి తెల్లటిద్రవము వెడలుచుండును. స్త్రీ జాతి యందు యీ జబ్బు సర్వసాధారణముగ నుండును. పసిపిల్లలకుగూడ యీ వ్యాధి సంభవించుచున్నది. చిరకాలముగ యీ వ్యాధివల్ల బాధపడువారి గర్భాశయము పుండగును. అట్టివారికి మేహజ్వరము, దగ్గు, నిస్సత్తువ, సంతాన హీనత సంభవించును.

బుడ్డి రు. 4-0

# కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్

15, వెస్టుకాట్ రోడ్డు, రాయపేట, మద్రాసు-14.

ఆంధ్ర ప్రదేశ్ కు ఏజంటు:

శీతారాం జనరల్ స్టోర్సు, బెజవాడ - సికిందరాబాదు.

వ్యవస్థాపకులు
డాక్టరు కే. యన్. కేసరి

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక

ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్
సి. సి. పున్నయ్య

సంపుటము ౩౭] జూలై 1958 [సంచిక ౭

# విషయసూచిక



ముఖచిత్రము : హెలన్ కెల్లర్



గృహలక్ష్మి స్వర్ణకంకణ గృహీత
శ్రీమతి దేశిరాజు భారతీదేవి

# గృహలక్ష్మి

జయజయ గృహలక్ష్మీ శ్రీ సఖి ! జయజయ లలితాంధ్ర ! మధుర సారస్వతిమా !
జయజయ లలనా రత్నమ ! జయజయ విద్యాప్రబోధ ! జయకల్యాణీ !



## గృహలక్ష్మి స్వర్ణకంకణము

గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానము మహిళాభ్యుదయాన్ని ప్రోత్సహించుటకని **1934** సం॥ ప్రారంభమయి యిప్పటికి 19 స్వర్ణకంకణములు బహూకరించ బడినవి. కంకణ గృహీతలలో ఉత్తమ కవయిత్రులు, రచయిత్రులు, కళాకారులు, సంఘ సేవాపరాయణులు, విద్వాంసులు కలరు. సాధారణముగా నీ కంకణ ప్రదానము పూజ్యబాబు కేసరిగారి కాలంలో గృహలక్ష్మి జయంత్యుత్సవంలో గృహలక్ష్మి కార్యాలయమున జరుగుచుండెడిది. కేసరిగారి అనంతిరము వారు ఏర్పరచిన విధిని వినియోగించి వారి జన్మదినోత్సవంనాడు గృహలక్ష్మి స్వర్ణకంకణ ప్రదానము, పరివారమునకు అన్న వస్త్ర దానములు జరుగుచున్నవి.

ఈ సంవత్సరము కంకణమును ఉత్తమ రచయిత్రి, కవయిత్రియగు బాపట్ల వాస్తవ్యురాలు శ్రీమతి దేశిరాజు భారతీదేవిగారికి బహూకరించబడినది. ఈమె సారస్వత

సేవ అపారమైనది. ఈమె కవితా రచనలు నియమ బద్ధములై, సరళమైన శైలిలో ప్రబోధకములు, ఆదర్శనీయములై ప్రజాదరాభిమానములకు పాత్రములైనవి. శ్రీమతి భారతీదేవి ఆదర్శనీయమైన గృహిణి, సరళహృదయ. ఈమె సారస్వత సేవా పరిశ్రమలు మహిళా లోకానికి మార్గదర్శకములై అభ్యుదయాన్ని ప్రోత్సహించగలవని ఆశిస్తూ ఆమెకీకంకణ ప్రదానము మాకు మహదావకాశముగా భావించు చున్నాము.

పూజ్యులు కేసరిగారు గృహలక్ష్మి పత్రికద్వారాను, అన్యథాను మహిళా పురోభివృద్ధిని ప్రోత్సహించినది జగమెరిగిన విషయము. వారి ప్రజాహిత కార్యక్రమంలో మహిళా సంక్షేమం ప్రధానమైనదిగా నుండేది. పూజ్యబాబు వదాన్యత, ఆదరాభిమానములతో అనేకమంది వ్యక్తులు, అనేక సంస్థలు పురోభివృద్ధినొంది తమ స్వీయ సౌభాగ్యముతో బాటు జాతీయ శ్రేయస్సుకు తోడ్పడుచున్నవి.

గృహలక్ష్మి పత్రిక అనాదినుండికూడ విద్యా విజ్ఞానములతో బాటు అభ్యుదయ రచయితలను ప్రోత్సహించుచున్నది. సాంఘిక, రాజకీయ రంగాలలో మహిళా లోకానికి పూరించిన చైతన్యము యీనాటి మహిళాభ్యుదయానికి చాలవరకు కారణమనిన అతిశయోక్తి కాదు. మహిళాలోకం మరింత ఆసక్తితో పరిశోధన, పరిశ్రమలతో కూడిన వ్యాసములను రచించి పంపి గృహలక్ష్మి పత్రికా నిర్వహణకు తోడ్పడవలసినదిగా విజ్ఞప్తి చేయుచున్నాము.

తమ జీవిత కాలంలో నిర్విరామంగా ప్రజాహితాన్ని ప్రోత్సహించిన పూజ్యబాబు కేసరిగారికి కృతజ్ఞతాంజలిని యీ సందర్భమున నివేదించుట మన ధర్మము.

---

## డాక్టరు కే. యన్. కేసరిగారి జన్మదినోత్సవము

ఈ నెల 5 వ తేదిన గృహలక్ష్మి జయంత్యుత్సవము, డా॥ కేసరిగారి జన్మదినోత్సవము జరిగిన సందర్భమున బాపట్ల వాస్తవ్యురాలు శ్రీమతి దేశిరాజు భారతీదేవికి గృహలక్ష్మి స్వర్ణకంకణము బహూకరించబడెను.

గృహలక్ష్మి సంపాదకుడు శ్రీ సి. సి. పున్నయ్యగారు శ్రీమతి భారతీదేవిగారిని పరిచయము చేయుచు ఆమె కవితా రచనలను పూజ్యబాబు కేసరిగారు విశేషంగా నభిమానించేవారనియు, ఆమె పరిశోధనాత్మక సారస్వత సేవాపరిశ్రమలు అపారములని,

(340 వ పేజి చూడుడు)

# ధర్మం శరణం గచ్ఛామి

శ్రీ నాయుడు వెంకట సీతారామమూర్తి

పూర్వం ఒక ఊళ్ళో భీముడు అనే బోయవాడుండేవాడు. ఆతడు కడు దుర్మార్గుడు. మార్గస్థులను హింసించి వారివద్దనున్న ధనాన్ని దోచుకోవడమే యీతని పని.

ఒక రోజున ఆ దారిని పోతున్న బోధిసత్త్వుని హింసించి, చిత్రవధ చేశాడు. చంకను తగిలించిన సంచిలో ఏమైనా తినుబండారాలు, డబ్బు ఉన్నదేమో చూశాడు. కానీ సన్యాసాశ్రయం స్వీకరించిన వారి దగ్గర ఏముంటుంది? శరీరం అంతా రక్తం కారుతున్నా బుద్ధుడు బాధపడకుండా బోయవానిని చూచి ఫక్కున నవ్వేడు.

"ఏ! ఏడవకుండా ఎందుకు నవ్వుతున్నావ్!" అని ప్రశ్నించేడు బోయవాడు.

"నీ అమాయకత్వాన్ని చూసి నవ్వుతున్నాను నాయనా!" అంటూ సంతోషంగానే సమాధానమిచ్చేడు బుద్ధ భగవానుడు.

"నేను అమాయకుణ్ణా! ఓరి మూర్ఖుడా! నా పేరు చెపితే యీ చుట్టుపక్కల చీమకూడా నీళ్ళు త్రాగదు తెలుసా?" అంటూ మీసం ఒడి తిప్పేడు.

"తెలుసు. నీ దుర్మార్గాలు, దుండగాలు, దోపిడీలు, హత్యాకాండలు, అనీ, తెలుసు. కానీ, వాటి ఫలితాలను నీవుమాత్రం తెలుసుకో లేక పోతున్నావు. నీవు చేస్తున్న పాపాలన్నీ పిశాచాలై నిన్ను చుట్టి ముట్టి బాధిస్తాయి. అమాయకత్వంతో ఇప్పుడు నీవు చేస్తున్న యీ ఘోరాలకు ఫలితంగా ఆనాడు ఎంతగా బాధ పడతావో యిప్పుడు నీకు అర్థం కావడం లేదని నవ్వుతున్నాను" అని పలికేను.

"నేను పాపాలు చేస్తున్నానా! ఆ పాపాలకు మళ్ళీ ప్రాయశ్చిత్తం అనేది ఉంటుందా? నా పొట్ట కోసం నేను ప్రాకులాడడం పాపమంటావా? నీ కేమైనా మతిపోయిందా?" అన్నాడు బోయవాడు.

"ఒక జీవి మరొక జీవిని హింసించడమే పాపమంటారు. ఆ పాపాలన్నీ పండి తిరిగి నిన్నే హింసించి చిత్రహింస చేస్తాయి. జీవహింసను మాను. అదే నీకు పరమార్థం"

"మరి నాకు తిండి?"

"దోపిడీలు చేస్తేనే కాని నీ పొట్ట గడవదా? కష్టపడి పనిచేసుకో. నీవొక్కడవే కాదు. నీకుటుంబాన్ని సహితం పోషించుకో గలుగుతావు"

"అయితే జీవహింస పాపమే నంటావా?"

"అవును నాయనా! నీ శరీరాన్ని నువ్వు ఎంతగా ప్రేమిస్తున్నావో ఎదుటివారినికూడా ఆవిధంగానే ప్రేమించు. నీవు హింసిస్తున్న ప్రతిజీవి పడుతున్న బాధ నీకు తెలియదు. ఒక్కసారి నీ శరీరాన్ని నీవు బాధ పెట్టుకుని చూడు"

వెంటనే బోయవాడు కత్తితో తన చేతిని చీల్చుకున్నాడు. కారుతున్న రక్తాన్ని ఆపుకోలేక బాధపడ్డాడు.

"నిజమే స్వామీ! నా తప్పులు క్షమించండి. నేను చాలా పాపం చేశాను. నేనే గొప్పవాణ్ణనే గర్వంతో మొండిగా ఎన్నో అఘాయిత్యాలు చేశాను. ఇంక ఎన్నడూ చేయను. దేవునిలాగ వచ్చి నాకు జ్ఞానోదయం కలిగించేవు. నన్ను రక్షించేవు." అంటూ బుద్ధుని కాళ్ళపై పడ్డాడు.

"లే నాయనా! [illegible] నీ పాపాలకు ప్రాయశ్చిత్తం. [illegible] జీవహింస చేయకు. అబద్ధం ఆడకు. సత్యవంతుడవై నీతిని పాలిస్తూ దైవనామధ్యానం చేసుకో. శత్రువైనా,

మిత్రుడైనా ఎదుటివాణ్ణి ప్రేమించడమే మానవుని ధర్మం. నీ ధర్మాన్ని నీవు నిర్వర్తించుకో!” అంటూ హితబోధ చేశాడు.

“ధర్మం శరణం గచ్ఛామి” ధర్మాన్నే నేను శరణు కోరుచున్నాను.” అంటూ బుద్ధుని పాదాలను కౌగలించుకున్నాడు.

ఆనాటినుండి బోయవాడు సత్యవ్రతుడయ్యాడు. హత్యలు, దోపిడీలు విడనాడి సన్మార్గంలో పడ్డాడు. ఎట్టి క్లిష్ట పరిస్థితుల్లోనైనా సత్యాన్ని విడనాడకుండా జీవితాన్ని దేవుని పాదాలచెంత గడుపుతున్నాడు.

ఈతని సత్యవ్రతనిష్ట లోకమంతా వ్యాపించిపోయింది. సురలోకాధిపతి అయిన ఇంద్రునికి సయితం యీతని కీర్తి తెలిసిపోయింది.

ఒకనాడు యీతని సత్యవ్రతాన్ని పరీక్షించడానికని ఇంద్రుడు ఎఱుక వేషంలో ఒక పందిని తరుముకుంటూ బయల్దేరాడు. ఆ పంది సత్యవ్రతుని చెంతకు సమీపించి రక్షించమని శరణు జొచ్చింది.” అలాగే రక్షిస్తానని” అభయమిచ్చేడు సత్యవ్రతుడు.

ఎఱుకవాడు యీతని చెంతకు పరిగెత్తుకువచ్చి “యీ దారిని పంది వచ్చిందా?” అని ప్రశ్నించేడు.

సత్యవ్రతుడు సందిగ్ధావస్థలో పడ్డాడు. వచ్చిందని చెప్తే పంది ప్రాణానికి ప్రమాదం కలిగించేవాడవుతాడు. రక్షిస్తానని చెప్పిన తన మాటకు వ్రతభంగం కలుగుతుంది. రాలేదని చెప్పితే తాను అబద్ధం ఆడినవాడవుతాడు.

సత్యవ్రతుడు దీర్ఘంగా ఆలోచించుకొని యీ విధంగా సమాధానం యిచ్చేడు.

“అయ్యా! పందిని మాచినది కన్ను. ఆ కన్ను మాట్లాడలేదు కదా! మీకు సమాధానం చెప్పవలసినది నోరు. కానీ ఆ నోరు పందిని చూడలేదుకదా! చూడకుండా చూసినట్లు నోరెట్లు చెప్పగలదు?”

వ్రతభంగం కలుగకుండా చమత్కారంగా చెప్పిన సమాధానానికి దేవేంద్రుడు సంతసించి సత్యవ్రతునకు ముక్తిని ప్రసాదించేడు.

—— (o) ——

(౩౩౮ వ పేజీ తరువాయి)

ఆమెకు కేసరిగారి జన్మదినోత్సవ సందర్భమున యీ ఏటి స్వర్ణకంకణమును బహూకరించి సత్కరించుట మహాభాగ్యమని చెప్పిరి.

మహిళాభ్యుదయ పురోభివృద్ధులకు ఏర్పడి, కృషి చేయుచున్న గృహలక్ష్మి పత్రికా నిర్వహణకు కంకణ గృహీతల, పాఠకుల, రచయితల యొక్క సహకారమవసరమని విజ్ఞప్తి చేసిరి.

శ్రీమతి భారతీ దేవిగారు తమ కృతజ్ఞతను వెల్లడించుచు తాము రచించిన ‘నవపద్య రత్నముల’ను చదివి, తన్ను సారస్వత రంగంలో రచయిత్రిగా పూజ్యులు కేసరిగారు, వారి గృహలక్ష్మి విశేషంగా ప్రోత్సహించినవనియు, కేసరిగారు తమ ఔషధముల ద్వారా మహిళల ఆరోగ్యభాగ్యమును, గృహలక్ష్మి పత్రిక ద్వారా విద్యావిజ్ఞాన పురోభివృద్ధులను సమకూర్చారని జోహారు లర్పించి వారి కుమార్తె శ్రీమతి శారదా దేవి, కుటుంబము, వారు ప్రోత్సహించినట్టివియు, వారి పేరటివియునగు ప్రజాహిత సంస్థలు కలకాలము వర్ధిల్లునట్లుగా భగవంతుని ప్రార్థిస్తున్నాననిరి.

ఎప్పటియట్లు కేసరి కుటీరం ప్రైవేటు లిమిటెడ్ పరివారమునకు అన్న వస్త్ర దానములు జరిగెను.

# శ్రీ కే. యన్. కేసరిగారి జన్మదినోత్సవ సందర్భమున

## రచించిన పద్య నవరత్నములు

—o❋o—

భాషాభిమానియై, వైద్య విద్వర్యుడై
ప్రస్తుతిగాంచిన పండితుండు
సంఘ సంస్కర్తయై, సదమలశీలుడై
సురుచిరమూర్తియౌ శుభకీర్తి
ధర్మార్థకామ తత్పరధీ విలాసుడై
చతురవర్తనుడైన శాంతి ధనుడు
మానియై దేశాభిమానియై, దానియై
జన్మసార్థతగన్న సజ్జనుండు
కష్ట సుఖముల సమముగా సహనమున, వ
హించి ధీరత విజయంబు గాంచినట్టి
కేసరీకీర్తి మూర్తికి, గేలుమోడ్తు
భక్తినై నాంధ్రమహిళల పక్షమునను.

2

తొలుత స్వయంకృషితో కొంత కొంత
దానెంతేని ధనమునార్జించినాడు
ఆర్జించి రక్షించినట్టి ధనంబును
సద్వినియోగంబు సలిపినాడు.
అబలాజనంబుల నామయస్థితినొంద
నౌషధంబులొసంగి యలరినాడు
మహిళాభ్యుదయమెంచి 'గృహలక్ష్మి' పత్రిక
వెలయించి త్రెన్ను జూపించినాడు
బాల బాలికా విద్యకై పాఠశాల
కూర్మినింపొందగా నెలకొల్పినాడు
సచ్చరిత్రుడు శ్రీ నృ కేసరికి సాటి
మార్గ దర్శకుడొకరుండు మహిని గలరె?

3

అన్నవలిచ్చు నా మధుకరాన్నము దిన్న
కృతజ్ఞతావ్రతం
బెన్నివిధాల జేతునని, యెంచి, సమస్త
విధాల దాను న
భ్యున్నతిగన్న నాటికి, మహోన్నతవైఖరి
నాచరించి, దే
శోన్నత కీర్తి సంపదల నొందెను, కేసరి,
తత్ఫలాప్తియై

4

అతనికతండె సాటియని, యందరు నెవ్వర
యెందునట్లు, సం
తతము స్వయంకృషిన్నపి, దానదయా
పర ధర్మవర్తనా
వితతయశంబుగాంచి, చనె, వేల్పుల
వీటికి, కల్పవాటికా
యుత హరిచందనద్రుమవిహారము
"కేసరి" జేయ వేడుకన్

5

ఆ మహనీయు పుత్రిక సమంచిత "శారద"
తండ్రిసువ్రతం
బోముచు, మానినీ మణులయున్నతి
గోరుచు, స్వర్ణకంకణో

# దేశిరాజు భారతీదేవి

## జీవితచరిత్ర



భారతీ దేవి బాపట్ల వాస్తవ్యురాలు. అచటనే న్యాయవాదులైన శ్రీ చంద్రమౌళి చిదంబరరావు పంతులుగారి ఏకైక పుత్రిక. తల్లి అన్నపూర్ణమ్మగారు. 1915 వ సంవత్సరంలో జన్మించిరి. వీరి తల్లిగారు అధిక విద్యావతి కాకున్నను స్త్రీ సంఘ సేవాసక్తి కలదై, 1913 వ సంవత్సరములో ప్రథమాంధ్రజన మహాసభతోపాటు బాపట్లలో జరిగిన ప్రథమాంధ్ర మహిళా సభ కార్యవర్గమునకు సహాయ కార్యదర్శినిగాను, మహిళా సమాజస్థాపకులలో నొకరుగను పనిచేసియున్నారు. మహిళా సమాజములోనేగాక శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారితో గలసి కాంగ్రెసు సేవలోకూడ పాల్గొనియున్నారు. శ్రీమతి లక్ష్మీబాయమ్మగారును ఆమె భర్తగారును కాంగ్రెసోద్యమ సంబంధమైన ఉప్పు సత్యాగ్రహమున చెఱసాలకేగిన కాలములో శ్రీమతి అన్నపూర్ణమ్మగారు గుంటూరులో శారదానికేతనమున లక్ష్మీబాయమ్మగారి స్థానము వహించి ఆ సంస్థ కార్యభారము వహించియుండిరి. అనంతరము 1937, 1945 సం॥ లలో శాసన సభ్యుల యెన్నికలయందు కాంగ్రెసు ప్రచారము చేయుచు, స్త్రీ జనులలో పని చేసియుండిరి.

శ్రీమతి భారతీదేవిగారి తండ్రిగారును మంచి కవులు. న్యాయవాది వృత్తినవలంబించుచు కాంగ్రెసు సేవ చేసినారు. వీరు రచించినవి రాఘవశతకము, రాజరాజేశ్వరీ శతకము, శంకరశతకము, చిత్తూరుముట్టడి (నాటకం) ఆత్మబోధ, కన్యకాపరమేశ్వరి (నాటకం), భగవద్గీత ఆంధ్రానువాదము, సర్వవేదాంత సిద్ధాన్త సార సంగ్రహము మొదలైన పెక్కు గ్రంథములు గలవు.

శ్రీమతి దేశిరాజు భారతీదేవిగారు - బాలికా పాఠశాలలో కొంత కాలము మాత్రమే విద్యనభ్యసించి యుండెనేగాని పరీక్షలనిచ్చి యుండలేదు. ఈమెకు పన్నెండవ యేటనే వివాహము జరిగెను. ఇంటియందు తండ్రిగారి కడనే భారత భాగవతాది గ్రంథములు పఠించి బాగా విజ్ఞానము సంపాదించెను. చిన్నతనము నుండియు వ్యాసములు వ్రాయు నభ్యాసము కలిగియుండెను. నెల్లూరు తిక్కనవర్ధమాన సమాజమువారు తిక్కనగారి జయంతి జరుపు సందర్భమున ఉత్తమ వ్యాసమునకు శ్రీ కేసరి స్వర్ణపతక ప్రదానము గావించుచుండెడివారు. 1935వ సం॥ లో పోటీ పరీక్షలో ఈ బహుమానము శ్రీమతి భారతీ దేవిగారి కొసంగబడినది.

తల్లివలెనె భారతీ దేవిగారు మహిళా సంఘ కార్యమునందు శ్రద్ధవహించుచు స్థానిక మహిళామండలి సభ్యురాలుగను స్త్రీ హితైషిణీ మండలి సహాయ కార్యదర్శిగాను, కార్యవర్గసభ్యురాలిగను పనిచేసి యున్నారు.

శ్రీమతి వచన రచనయందేగాక పద్య రచనల సయితము చేయుచు "కాంతాశతకము" కందపద్య శతక మొకటి రచించిరి. ఆ శతక గ్రంథమును శ్రీ శ్రీ శ్రీ కేసరి గారు దయతో ముద్రించి ప్రకటించిరి. అటుపిమ్మట "ముక్తాంబ" "సత్యప్రతిజ్ఞ" అను ఏకాంక నాటికలుగూడ 'గృహలక్ష్మి' పత్రికలో ప్రచురింపబడినవి. అనంతర మీమె "శ్రీ కృష్ణ మహిమార్ణవము" అను గద్య రచనము కావించి శ్రీ కేసరిగారి కంకిత మొసంగినది.

"ముద్దుకృష్ణ" యను గీత శతకము నొకదానిని రచించినది.

అంతేయగాక విజయవాడ రేడియో కేంద్రమువారిచే నడుపబడుచున్న వనితా సాహిత్యభాగము వారి ఆదేశముపై కొన్ని సాహిత్య ప్రసంగములు చేసియున్నది. వానిలో (1) కాళిదాస శాకుంతల నాటకమందలి నాయిక పాత్ర విమర్శనము. (2) ఉత్తరకాండలోని సీత పాత్ర (3) సూరనార్య ప్రణీతమైన కళాపూర్ణోదయము నందలి "సుగాత్రి" పాత్ర మున్నగు విషయములనుగూర్చిన ప్రసంగములు జరిపియున్నది. ఈమె పద్యము లప్పుడప్పుడు "గృహలక్ష్మి", "శారద" పత్రికలలోను ప్రచురింపబడియున్నవి.

అంతియగాక మదరాసులోని తెలుగు భాషా సమితివారు నిర్ణయించిన "కవిత్రయ కవితారీతులు, తరువాతి కవులపై వారి ప్రభావము" అను శీర్షికతో పోటీ గ్రంథ రచన సందర్భమున శ్రీమతి భారతీ దేవిగారికి ప్రథమబహుమానము లభించెను. ఈ బహుమతి రాష్ట్రపతి శ్రీ బాబు రాజేంద్రప్రసాద్ గారి చేతిమీదగా హైదరాబాద్ నగరమున జరిగిన బహుమాన ప్రదానోత్సవ సందర్భమున నొసంగబడెను. ఈ కవితా విమర్శన గద్య కావ్యము సుమారు 300 పుటలు గలదగుటచే తను ద్రవ్యాభావము చేతను ముద్రింపించి ప్రచురణకు తెచ్చుట కామె కింతవరకు తటస్థపడలేదు.

ఈమె భర్తగారి పేరు రామచంద్రరావు గారు. ఈమెకు నలుగురు బిడ్డలు. అందు ఇద్దరు మగవారును, ఇద్దరాడువారునై యున్నారు. వారు విద్యార్థి దశయందే యున్నారు.



# కేనోపనిషదు

మూలం :
స్వామి చిన్మయానందజీ

అనువాదం:
డాక్టరు W. రాధాకృష్ణయ్య



## ఖండము I

### మనః పూర్వక అనుచరణము

(గతసంచిక తరువాయి)

"మనసును, బుద్ధిని నియమించి నడిపించునదెవరు ?" అను శిష్యుని ప్రశ్నకు "అది మనస్సుకు మనస్సు" అను సమాధానమును గురువు తెలిపియున్నాడు. సూటియగు శిష్యుని ప్రశ్నకు గురువు యొక్క సమాధానము సూటిగ కనుబడుటలేదు. అనేక గూఢభావములతో మరుగుబడియున్నది.

పైపైన చూచుటకు అటులనే యున్నదికాని, ఈ సమాధానమును చక్కగ గ్రహించుకొలది, గురువు ఎట్టి చులకనగ మాట్లాడియుండలేదనియు, శిష్యునియందతనికిగల గాఢానురాగమువల్ల, వేరు రీతి సమాధానము తెలిపియుండినచో శిష్యుని మనసున విపరీత భావము నెలకొల్పి, అతనిని కార్యభ్రష్టుని చేసియుండగలడు. "బుద్ధికి బుద్ధి, కన్నుకు కన్ను, చెవికి చెవి" ఈ రీతి తెలుపుటవల్ల వెలుపలి ఇంద్రియ గోళములు, బుద్ధి మొదలగునవి తమంతయవి వ్యవహరించజాలవనియు, వీటిని వ్యవహరింపజేయుశక్తి తనయందు అంతరమున యున్నదను సూచన ప్రకటితమగుచున్నది.

శిష్యుని ప్రశ్నకు గురువు సమాధాన మిచ్చుటయేగాక, అతనిని ఈ స్థూలప్రపంచ మనసు, ఇంద్రియములనుండి వాటి కతీతముగనుండు సూక్ష్మ ప్రపంచమున ప్రవేశపెట్టుచున్నాడు. బాహ్య ప్రపంచ దృశ్యమునను, స్థూల ఇంద్రియ మనోవ్యాపారములయందును సత్యభావము లేదని వదలుకొని, శిష్యుడు గురువుతో సరిసమానముగ ఆత్మలోకమున నడువగలిగినచో గురువు సహాయపడగలడు. లేకున్న సాధ్యము లేదు.

ఆత్మలోకము మనకు పరిచయములేదు. అదియొక స్వప్నలోకమువంటి వింతైన విషయము. నిజముగ అనేక జనులు ఈ ఉపనిషత్తు బోధను వినుచున్నారనగా, పూర్తి వైరాగ్యముకలిగి ఇందు తెలుపబడిన మార్గమున ప్రయాణము చేయుటకు సంసిద్ధులుగ నున్నారని కాదు. ఇది వినుటకు వింత విషయముగ నున్నది కనుక చాలమంది వినుచున్నారు. మరికొంతమంది ఉపనిషత్తు భావములు కొంత తెలుసుకొనినంతనే, వాటియందు పూర్ణజ్ఞానులయి యున్నామను భావము కూడ కలిగియుండగలరు.

తరతరములుగా ఇట్టి జ్ఞాన గర్వము మానవుని యందు కనబడుచున్నది. ఆ కారణమునుబట్టియే ప్రాచీన మహాత్ములు మోక్షమార్గము చాల కష్టసాధ్యము. ఉపనిషత్తు జ్ఞానము ఏకొద్ది పుణ్యాత్ములకో లభ్యమగుచున్నది అని నుడివియున్నారు. మోక్షమార్గము కత్తి పదునుపైన నడకవంటిదని ఉపనిషత్తులే పలుకుచున్నవి. అయినను జీవితమున యొక గొప్ప ఆశయమున్నదను హెచ్చరికతోనైన సామాన్య మానవుడు తన నిత్య సంపాద్యము, భోజనము, నిద్రయందే తృప్తిజెంది కాలి, బూడిద కాకుండుటకు ఒక ఆకర్షణ కనబడుచున్నది. అట్టి సామాన్య మానవుడు తాను నిప్పుతో చెలగాటమాడుచున్నాడనుట తెలియక అసత్యవిలువలయందు, జీవితమంతయుగడపి,

మోసపోయి, నిరాశ జెంది, విసుకువల్ల, పిరికితనముతో ఆత్మహత్య చేసుకొనును.

తన నిత్య జీవిత ఆవరణముననే ఒక గొప్ప సత్య వస్తు వున్నదను పారమార్థిక జ్ఞానము కలుగుటవల్ల అతనికి కొంత దుఃఖోపశమనము, సుఖము, ప్రోత్సాహము, ఆశ కలిగి తన సంకట పరిస్థితులను దాట గలుగుచున్నాడు.

శిష్యుడు తన దృష్టిని ఇదివరకు పరిచయములేని వింత దేశములలో ప్రవేశపెట్టుటకు సంసిద్ధుడుగ నుండవలెనని గురువు తన సమాధాన చాతుర్యమున హెచ్చరించుచున్నాడు. అతని మాటలు గొప్ప పరిశ్రమకు తయారుగ నుండమని తెలుపు మేలుకొలుపులుగా నున్నవి. గురువు తెలిపిన సమాధానము సూటిగ నుండకపోయినను దూరప్రయాణముచేసి కనుగొనవలసిన గొప్ప సత్యమొకటి యున్నదని సూచించుచున్నది. ఈ సమాధానము శిష్యుని మనోనేత్రము నకుగల నూతన కవాటమును తెరచు తాళపుచెవిగా నున్నది. దీనియందు ముందు తెలుపబోవు విషయము యొక్క సూక్ష్మ సంగ్రహము బీజరూపమున దాగి యున్నది. ఇంద్రియములు, బుద్ధి చూచి విని తెలుసుకొనునవి సత్యస్వరూపములు కావు. తనలోగలది చూచువాడు తెలుసుకొను పరమాత్మ ఒకడే సత్యము.

మనుష్యులందరియందును దివ్యప్రకాశమున్నది. వారికి తెలియకపోవచ్చును. జీవునియందు పరమాత్మ క్రొత్తగా ప్రవేశింప నవసరములేదు. గూఢముగ అతడందు దాగియేయున్నాడు. కాని మనమెవరో మనకు తెలియదు. మనలో నివసించు పరమాత్మను మనమెఱుగలేకున్నాము. అందువల్ల పిచ్చి, ఉన్మాదము తెలుసుకొనక మానవులని తలచుచున్నాము. పరిమితులకు అపరిపూర్ణతకు సమ్మతించి వ్యవహరించుచున్నాము. ప్రతియొక్కరు పారమార్థిక జ్ఞానముతో అద్వైత సత్యమును తెలుసుకొనవలెను. ఇతరులు మార్గము చూపగలరు. ఉత్సాహము కలిగించగలరు. కాని అనుభవము పొందుట స్వప్రయత్నమువల్లనే సాధ్యము.

ఈ మంత్రమున రెండవ పాదమున ఈ లోకమును వదలిన వెనుక సాధకుడు అమృతపదవి పొందుచున్నాడు అని ఉన్నది. దీని భావమును అనేక విధముల చర్చింపబడియున్నది. అట్టి విచార ఫలితముగ రెండు మతములు ఏర్పడియున్నవి. ఒకటి - పరిపూర్ణపదవి ఈ శరీరముతో జీవించియుండువరకు సాధ్యముకాదు. ఉత్కృష్టజీవులు ఈ దేహము వదలిన వెనుక పరిపూర్ణపదవిని పొందుచున్నారు. అనగా వేదవ్యాసులు మొదలగువారు తమ దేహములు వదలుకొనిన వెనుకనే పరిపూర్ణులు కాగలిగిరి! ఈ భావము ఉపనిషత్తునందలి పదముల వాచ్యార్థము ననుసరించియున్నది. కాని ఉపనిషత్తులలో స్వప్రయత్నమువల్ల సరస సల్లాపములాడ నేర్చిన యోగ్యుడు మాత్రము ఉపనిషత్తుల భావములను తెలుసుకొనగలడు.

శ్రుతి సంతతి బిడ్డలు తల్లివద్దచేరి ప్రేమ పాలను చేపునట్లు చేయుదురు. ప్రేమతో మృదువుగా ఆ తల్లి పాలను పీల్చి త్రాగ ప్రయత్నించుచున్నారు. శ్రుతి నీకు నడుచుట నేర్పును. మొదలు సూక్ష్మజ్ఞాన సన్నిధిని నిన్ను చేర్చును. పిమ్మట నీవు స్వయముగా సూక్ష్మాతి సూక్ష్మమును గ్రహించగలవు.

ఇందుగల రెండు సిద్ధాంతములను నిష్పక్షముగ విచారించినచో, శ్రీ శంకరుల వేదాంతదృష్టి చక్కనిదనియు చాల సమ్మతింప దగినదనియు తెలియుచున్నది. రెండవ పక్షమువారుకూడ ఈ విషయమున తీవ్రవిమర్శ చేసియున్నారు. కాని అందు కొంచెము అభిమానము, పక్షపాతము లేక విపరీతభావము కనబడుచున్నది. ఆ సిద్ధాంత ప్రకారము మరణమువరకు కర్మ చేయుచుండవలెను. కర్మతోడు ఉపాసన కలసియుండవలెను. ఈ ఉపనిషత్తులలోనుండు మంత్రములన్నియు కేవల ధ్యానమునకు ఉపయోగపడుచున్నవి అని వారి భావము.

వారికి ఉపనిషత్తులు యోగమార్గములు కావు. అందలి మంత్రములు ధ్యానమునకుపయోగపడుచున్నవి. కాని శంకరుల వివరణ చాల తర్కసమ్మతముగ

నున్నది. గురువు శ్రుతుల పూర్ణజ్ఞానము పొందియుండవలెను. అంతియేకాక, బ్రహ్మనిష్ఠయందు పూర్ణానుభవము కలిగియుండవలెను అని తెలుపుచున్నాడు.

శ్రుతి యందలి వాచ్యార్థమును గమనించినయెడల, పరిపూర్ణ గురువు నొకనినికూడ మనము కనుగొనజాలము అని వాదించుచున్నాడు. ఎందుకనగా, ఒక గురువు పరిపూర్ణుడు కాగానే, అతడు తన దేహమును వదలవలసియుండును. మరణానంతరమే అతడు బ్రహ్మానుభవము పొందవలెను. ఇట్టి వాచ్యార్థ భావము ప్రత్యక్ష విరుద్ధముగ కనబడుచున్నది. ఈ భావము శ్రుతులయందు లేదని శ్రుతుల శైలివల్లనే తెలియుచున్నది.

అటులైన శ్రుతుల భావమేమి తెలుపుచున్నాడు? ఆత్మ సామ్రాజ్యమును లోతుగా వెదుకుచు సూక్ష్మ ప్రపంచమును చేరగలిగిన మహాపురుషులు తమ స్థూల ప్రపంచ సంబంధములను వదలవలసియున్నది. సర్వ సమాన వ్యాపకసత్యమును ఎఱుగుటకు నేను తాత్కాలికముగనైన మర్త్య ప్రపంచ ద్వంద్వములను, అహంకారమును పూర్తిగ వదలుకొనవలెను. నేను పూర్ణ శరణు పొందకపోయినచో నూతన సామ్రాజ్య సమీపము చేరజాలను.

సర్వసమాన వ్యాపక ఆనందరసము శాశ్వత సుఖమున, అమృతపదవియందు బాధలతోకూడిన దుఃఖ ప్రపంచము ఉండగలదా? మనము మన అల్పజ్ఞానమువల్ల మానసిక పరిమితులవల్ల మన బాధలు దుఃఖములతోకూడిన ప్రపంచమును కల్పించుకొనుచున్నాము. అందువల్ల మనము అసత్య విలువలుగల ప్రపంచమున అసత్య వ్యవహారములవల్ల అశాశ్వత పరిచ్ఛిన్న విషయములతో సంబంధములు కల్పించుకొని విసుగు చెందుచు, విధిని దూషించుచు, ఇది యంతయు సృష్టికర్తయగు బ్రహ్మయొక్క చేష్టలని నిందించుచున్నాము.

అటులైనచో మనము పరిపూర్ణజ్ఞానము పొందగలమా? పొందు, సత్పురుషులగు ధీరులు, సమస్త మును త్యజించి, సత్యజ్ఞానమును ఎట్లు పొందగలిగిరి. విషయములయందు నీవు చూపు విలువలు అసత్యములని వాటిని వదలుము. నీ దుఃఖములను చాలించుము. సర్వదా భ్రమించు ప్రపంచమున మనము కోరదగినది, పరితపింప తగినది ఏదియు లేదు. మానవ జీవితమున సుఖదుఃఖములు అనివార్యములు. అవి రెండును ఒక నాణెమునకుగల ఇరుముఖములవంటివి.

స్థూల ప్రపంచ సంపర్కములు, స్థూల ఇంద్రియములద్వారా కలుగుచున్నవి. తత్ఫలితముగ కలుగునవి దుఃఖజీవితములని భావము కలుగుచున్నది. కాని శ్రుతివాక్యములు సూచించు జీవకేంద్రమును మనము తెలుసుకొనగలము. "మనస్సుకు మనస్సు" అనబడు దానిని తెలుసుకొనవచ్చును. బుద్ధియందుండు ఆలోచనలను అతిక్రమించుటవల్ల పరిపక్వదశ పొందగలము.

ప్రపంచమునకు మనమెంత విలువ చూపుచున్నామో దానికి తగినట్లు వ్యవహారములు ఏర్పడును. బాహ్య ప్రపంచము మనలో ప్రతిబింబించునప్పటికి అది వికార స్వరూపము పొందుచున్నది. సత్య వస్తువుయొక్క వికారబింబమునే పరిచ్ఛిన్న మర్త్యుడు చూడగలుగుచున్నాడు. ద్రష్టకు, ప్రపంచమునకు, తత్ వస్తువునకు భేదము లేదు. మృగతృష్ణ కనబడుచుండునప్పుడుకూడ అచ్చట యడారి తప్ప వేరు లేదు. యడారిని గమనించగలిగినవానికి అలలు లేవు కదలుట లేదు. అన్నియు ఏకయడారిగా కనబడుచున్నది.

కొన్ని సాధనలవల్ల ఆత్మసాక్షాత్కార పదవి పొంద సాధ్యమని వేదాంతము బోధించుచున్నది. ఇది కేవలంభావనయని తలచినను, నేను సంసారినియని భావించుటకన్న ఎంతయో ఉత్తమము. మనము అసత్యమును సత్యమని, అశాశ్వతమును శాశ్వతమని తలంచుచుండుటవల్ల మన అహంకారమును పోషించి పెంచునట్లగుచున్నది. దీనినంతయు వదలి సత్యసామ్రాజ్యమును చేరవలెను. అదియే ఆత్మ సామ్రాజ్యము.

ఈ సత్యసామ్రాజ్య మెచ్చట నున్నది? దృష్టికగోచరముగనుండు ప్రపంచమెట్టిది? ఆ ప్రపంచ

మును తెలుసుకొను విధానమేమి ? అది తెలుసుకొనుటకై అందుబాటునయుండు వివిధ జ్ఞానమూలములను శోధించెదము. పారమార్థికమున మనము చేరగల క్రొత్త ప్రపంచమేదియులేదు. మనకు గురువు ఎట్టి అభిమానుష శక్తులు కలిగించుటలేదు. సత్యమును చేరుటకు మర్త్యగుణములతో నిరంతర పరిశ్రమవల్ల, స్వశక్తివల్ల సాహసించవలెను.

సామాన్య జీవితమున ఒక క్రొత్త విషయమును గురించి ఎట్లు తెలుసుకొనుచున్నాము? ఉదాహరణమునకు కొరియాలో యుద్ధము జరుగుచున్నదని మనకెట్లు తెలియుచున్నది? కొరియాలో యుద్ధము జరుగుచున్నదని తెలియు విధమునసే ఒక పరిపూర్ణ ప్రపంచమున్నదని తెలుసుకొనగలము. యుద్ధమును గురించి వార్తాపత్రికలద్వారా తెలుసుకొనుచున్నాము. ఇతరులు దాని విషయం మాట్లాడుచుండుటవల్ల తెలియుచున్నది. యుద్ధమున పాల్గొని గాయములచే దుర్బలులై ప్రత్యక్షముగా వారి మాటలవల్ల తెలియుచున్నది.

వార్తాపత్రికలు ఏమి తెలుపుచున్నవి ? యుద్ధరంగములో జరుగు వ్యవహారముల, విశేషముల నేరుగాచూచు వ్యక్తులు వార్తల మూలమున తెలుపుచున్నారు. వారి పరిచయము మనకులేదు. అయినను వారి మాటలను నమ్ముచున్నాము. ఉపనిషత్తు కర్తల విశిష్టజ్ఞానప్రభావము మనకు పరిచయములేదు. అయినను శ్రుతి అను వార్తాపత్రికలద్వారా సత్యాన్వేషణులకు వార్తలు అందుచున్నవి.

రేడియోలో వినబడు వార్తలు వినుచున్నాము. ఇదివరకు చూచియుండని వ్యక్తులు పలుకుచున్నారు. అదేరీతి బాహ్యపరిస్థితు లెట్లుండినను నాలో పారమార్థికదాహం ఆతురత ఎక్కువయుండినచో నా ఆలోచనా రాజ్యమున మానసిక రేడియోవార్తలు వినబడి సత్యమును వెదుక సాధనచేయగలను.

వేదవాక్యములు మరల మరల తెలిపినను మనము నమ్ముటలేదు. ఏలన అది బాహ్యాదృశ్య వ్యవహారములుగలేదు. గొప్ప గ్రంథములగు ఖురాన్, బైబుల్, రామాయణము అన్నియు "తత్త్వమసి" అని తెలుపుచున్నవి. కొరియా యుద్ధమును వర్ణించుటకు వార్తాపత్రికలవలె మత సంబంధ సత్యమును తెలుపుటకు మహాత్ముల ప్రవచనములు శ్రుతులయందు తెలియుచున్నవి.

వేడుంకు జీవిత విధానమును నీవుత్యజించుట వల్లనే పరిపూర్ణత పొందగలవు. పరిపూర్ణమనగా మన స్వస్వరూపప్రాప్తి. భగవంతుని మరుగుపరచు వ్యక్తిగత అహంకారము దాని కార్యములను వదలుట వల్లనే ఇది సాధ్యమగును.

మరియొక మూలమున సత్యమును తెలుసుకొనవచ్చును. సజీవ బ్రహ్మనిష్ఠులు ఈ మూలము. వారు సత్యఎఱుకయందు ప్రతిష్ఠితులైయున్నారు. కేవల ఆత్మస్పర్శవల్లనే మానవుడు పరిపూర్ణ సంస్కారము పొందుచున్నాడు. దిననిత్య జీవితమున జ్ఞానము సమకూరు మార్గములద్వారా ఆత్మజ్ఞానముకూడ పొందనగుచున్నది. ప్రపంచ విషయములను, వాటి జ్ఞానమును పొందుటయందుగల శ్రద్ధ పారమార్థిక విచారమునకూడ నిరంతరము చూపుచుండవలెను. మనలో జన్మ జన్మాంతరములనుండి పేరియుండు వాసనలను, కోరికలను చెత్తయనియెంచి తొలగించినతోడనే మన నిజస్వరూప ఆత్మపదవిని చేరుచున్నాము.

బైబులు, వేదములు, వార్తాపత్రికలు సత్సంఘమే సంభాషణలు. మహాత్ముల దర్శనమే గాయములు తగిలిన యుద్ధవీరులను కలయుట పారమార్థిక జీవితమును క్రొత్తగ అవలంభించినవారి ఆనంద ముఖములను గమనించుటే ఇందలి రాజకీయచర్చలు. దినమునందలి ప్రతి జ్ఞానసాధనవల్లను, పరిపూర్ణ ప్రపంచ విచారమును వెదుకవచ్చును.

## బంధించు గొలుసులు

ఇటీవల ఢిల్లీనుండి ఒక గొప్ప వర్తకుడు మద్రాసుకు బయలుదేరెను. ఇతని ప్రయాణమును కనుగొని

అతని డబ్బును తస్కరించవలెనని ఒక ధూర్తుడు గొప్ప వ్యాపారి వేషముతో తానుకూడ బయలుదేరి అదే పెట్టెలో ఎక్కెను. రాత్రి వర్తకుడు నిద్రించుచుండగా అతని సామానులనంతయు ధూర్తుడు శోధించెను. కాని అతని డబ్బు సంచి మాత్రము కనుగొనలేకపోయెను. మరుసటి ఉదయమున వ్యాపారి ఇతడు చూచుచుండగా తన సంచిని తెరచి తన డబ్బునంతయు సరిగా యున్నదని యెంచుకొనెను. సంచిని జోబులో పెట్టుకొనెను. రాత్రికూడ అతని సొత్తంతయు ధూర్తుడు శోధించెనుగాని డబ్బుసంచి దొరకలేదు. ఇట్లు మూడు రాత్రులు గడచిపోయెను. నాల్గవనాటి ఉదయంకూడ వ్యాపారి తన డబ్బును సరిగా యున్నదని లెక్క పెట్టుకొనెను. ఇరువరు మద్రాసు చేరిరి. ఎవరిదారినివారుపోవ నుద్యుక్తులై యుండిరి. అప్పుడు ధూర్తుడు తన ప్రయత్నము ఇదివరకు ఎన్నడును నిష్ప్రయోజనము కాలేదు గనుక చాల ఖిన్నుడై యుండెను. కాని ధైర్యముతో వ్యాపారిని తన డబ్బుసంచిని రాత్రులందు ఎచ్చట దాచుచుండెనని ప్రశ్నించెను. అతడు నవ్వుచు "అయ్యా! నీ తలగడ క్రిందనే దానిని దాచియుంచుచుంటిని" అని తెలిపెను.

ఇదేరీతి మిత్రులారా! నిత్యానందము మీలోనే యున్నది అని వేదాంతము తెల్పుచున్నది. మనకంటికి సూటిగా యున్నది. కాని మన అజ్ఞానమువల్ల దానికొరకు బాహ్యప్రపంచవస్తువులందు వెదకుచున్నాము. విసుగు విరామములేని వెదకడం, సత్యము సన్నిహితముగ యుండుటవల్ల మనము దానిని చూడలేకున్నాము.

న తత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి
నో మనో న విద్మో న విజానీమో
యథైత దనుశిష్యాత్ అన్యదేవ త
ద్విదితా దథో అవిదితా దధి
ఇతి శుశ్రుమ పూర్వేషాం యేన స్తద్
వ్యాచ చక్షిరే ॥ — 3

కన్నుగాని, వాక్కుగాని, మనసుగాని, అచ్చట ప్రవేశింపజాలవు. మేము దానిని ఎఱుగము. దానిని ఇతరులకు బోధించుట మాకు తెలియదు. అది తెలియువాటికి, తెలియబడనివాటికి అతీతము. మా గురువులు ఇట్లు చెప్పుచుండుట వినియున్నాము.

కంటి దృష్టి ఆ చోటు చేరజాలదు. అది జ్ఞాననిలయము. అజ్ఞాన ప్రభావమువల్లనే కండ్లు చూడగలుగుచున్నవి. ఆ సత్యప్రకాశమువల్ల కండ్లు చూచును. కన్నులకు వెనుకనుండు ద్రష్ట అజ్ఞానము. యంత్రములో చూచువానివలె, కన్నులతో చూచుచున్నాడు. యంత్రము తానుగా చూడజాలదు. యంత్రమునకు వెనుకనుండు వ్యక్తి చూడగలుగుచున్నాడు. అదేవిధముగ, ఆత్మయే మనలో ద్రష్ట. అతడేసత్యమైనకన్ను. విపరీతభావనవల్ల సత్యమును తెలుసుకొనక మనసే కన్నని, కంటివల్ల జ్ఞానముపొందుచున్నామని, తలచుచున్నాము. ఇంద్రియములద్వారా సర్వజ్ఞానము కలుగుచున్నదని భ్రమించుచున్నాము. ఇంతకాలము ఈ ఇంద్రియములు మనలో ఎట్లు ఉన్నవని తెలియకున్నాము. బాహ్యమున వ్యవహరించు ఇంద్రియములను సంస్కరించుటవల్ల మనసు స్వాధీనమగుచున్నది. మనసునందు ఒకశక్తి కలుగుచున్నది. ఆ శక్తి ఇదివరకు గూఢముగనున్నది. దానిని అంతరజ్ఞానము - లేక - లోచూపు అంటారు. ఈ జ్ఞానకన్నువల్లనే మనము సత్యమును అనుభవించవచ్చును.

"కన్నును బాహ్యమున ప్రసరింపజేయునది ఏది?" అనుట ప్రశ్న. కాని కన్నుకు కన్ను అని ఉత్తరము చెప్పనేలెందుకు? ఒక యువకుని "నీవెవరు" అని ప్రశ్నించినచో, అతడు నేనుపలాని మనిషి కుమారుడు అని సామాన్యముగా తెలుపును. ఆ యువకుడు కొంత అంతస్తుకలవాడైనచో, "నేను రామనాథపురమునకు సబ్‌కలెక్టరు" అని తనహోదాను తెలుపుకొనును. అదేవిధముగా మనవ్యావహారికప్రపంచమున చూచుటకు కన్ను ఒక పరికరముగానున్నదని తలచుచున్నాము. కాని ఉత్తమ గురువు, కంటికి కన్ను చూచుచున్నది. చెవికి, చెవి, వినుచున్నది అని తెలుపుచున్నాడు.

రామయ్యకుమారుడు దొరస్వామి. దొరస్వామి రామయ్య కాడు. అదేరీతి చెవికి చెవిగానుండునది చెవి కాదు. ఇట్లు సత్యము యొక్క రహస్యము గ్రహించుటకు గురువు శిష్యుని ప్రశ్నకు వక్రసమాధానము తెలుపుచున్నాడు. ఆత్మ విషయమిచ్చట చర్చ సాగుచున్నదని మరువకూడదు. ఆత్మకు గుణములు వ్యవహారములు లేవు. కనుక విషయము కాదు. విషయముల తెలుసుకొను విధమున బ్రహ్మ విద్యయందు సమాధానములు కుదురదు.

విషయమనగా నేమి ? నిర్ణీత పరిచ్ఛిన్న గుణములుగల వస్తువు విషయమనబడును. కనుక ఆత్మకు గుణములుండిన పరిచ్ఛిన్నమగును. నాకన్న విషయముగునా ప్రత్యేకముగనుండునది విషయం. నేను దానిని నా జ్ఞానేంద్రియములతో తెలుసుకొనగలను. ఆత్మ సత్యము ఇంద్రియములకు గ్రాహ్యము కాదు. అందువల్ల ఆత్మ గుణరహితము. గుణములు లేనిది ఆత్మ – అది శాశ్వత దివ్య ఎఱుక !

ఒక వస్తువు గుణాతీతమయినచో, అట్టి విషయమును నిర్ణయించి, బోధించగల విధమేమి ? పూర్వకాలమున భస్మాసురుడు గొప్పతపమువల్ల, తాను తాకినదెల్ల భస్మమగునట్టి వరము శివునివద్ద పొందెను. కడపట, శివునే భస్మము చేయవలెనని యెంచి తాను భస్మమాయెను. మన బుద్ధి ఒక భస్మాసురుడు.

సర్వవ్యాపక వస్తువు బుద్ధికి మనసుకు అందుబాటులో లేదు. ఒక వస్తువు నల్లగనున్నది అనుటవల్ల ఏమి కలుగుచున్నదో చూతము. మొదలు కండ్లు చూచుచున్నవి. మరల బుద్ధి తన పూర్వానుభవమువల్ల అది నల్లగానున్నదని తెలియుచున్నది. ఈ నలుపును ఆ వస్తువునకు జతపరచి, ఆ వస్తువు నల్లగనున్నదని తెలియుచున్నాము. ఇట్లు, చూచుట, వర్గపరచుట, క్రోడీకరించుట, మనోబుద్ధుల వ్యవహారముగనున్నది. భస్మాసురునివలె, బుద్ధి ఒకవస్తువును తెలుసుకొనిన వెంటనే దానిని విభజించి, వివిధరకములుగ వర్గీకరించుచున్నది. కనుక ఈ బుద్ధియొక్క వ్యవహారములు ఆత్మ సమీపమున నిష్ప్రయోజనముగుచున్నది.

బుద్ధి ఉత్తమ అంతస్తులలో వ్యవహరించినను, అది తన స్వభావముగు గుణగ్రహణములను విడువజాలదు. అది తనపూర్వ అనుభవ ఇంద్రియముల ద్వారా మాత్రము వ్యవహరించగలిగియున్నది. మనోబుద్ధులు విమర్శనాలయములలో ఉపయోగపడును కాని, ఆత్మ సన్నిధియందు పాదరక్షలకన్న హీనమై కడుదూరముగ నుండవలసియున్నవి. శుద్ధ ఎఱుక యొక్క సామ్రాజ్యమును ప్రవేశించుటకు అంతర్ముఖ దృష్టిని, లోచూపును – పొందవలెను. ఈలోచూపును క్రొత్తగా పొందుటకాదు. అది స్వాభావికముగనే మనయందున్నది. విషయరాసులను విమర్శించుకోలది, శ్రుతివాక్యములను, మననము చేయుకోలది మనకు అది భావముగ ఏర్పడుచున్నది. వేదాంతమును శ్రవణ, మననమువల్లనే గ్రహించవచ్చును. కాలము జరుగుకోలది వేదాంత శ్రవణమున ఎంతటి ఆనందముండునది మీకు తెలియగలదు. జీవిత భ్రష్టులకు ఆత్మాభిముఖము పొందు భాగ్యము సమకూడదు.

కండ్లుగాని, ఇతర జ్ఞానేంద్రియములుగాని, ఆత్మను సమీపింపజాలవు. కనుక ఆత్మనుగురించి ఇతరులకు బోధపరచువిధము మనకు తెలియకున్నది. అది తెలిసినదానికన్న వ్యతిరేకము. తెలియనిదానికన్న వ్యతిరేకము. కనుక అట్టి సత్యమును తెలుపుటకుగల మార్గము ఆగమ శాస్త్రమొకటియే. అనేకచోట్ల గురువులు మాకిట్లు బోధించియున్నారు, అనుమాటను తరచుగా వినగలిగెదము.

ఉన్నత విచార అంతస్తులను చేరుటకు మన బుద్ధి ఉపయోగపడదు. అంతర్ముఖ దృష్టి యొకటియే ఉపయోగించును. సమాధిస్థితియందు మహాత్ములందరు అనుభవించగలిగిన శాశ్వతసత్యము ఒక్కటిగా యున్నది. మార్గములు ఎన్నియుండినను, గమ్యస్థానము యాత్రముగియు దేవాలయము యాత్రికులకందరికి ఒకటిగనే యున్నవి. తీక్ష్ణ ఆత్మానుభవసమాధిస్థితి, ఏకముగానున్నది. వివిధ ఋషులు వివిధ రీతుల వర్ణించినను అనుభవము ఏకముగానున్నది. మరి విషయములు కొంచెము దొరకినను, దానిని గ్రహించ

# శ్రీ రామ కర్ణామృతము

(ఆంధ్రానువాదము)

ద్వితీయాశ్వాసము

శ్రీ కల్లూరి అహోబలరావు



(గత సంచిక తరువాయి)

– ౧

చక్రమొక చేత మఱొక హస్తంబునందు
శంఖము ధరించి, గళమునఁ జారు తార
హారము, నుదుటియందుఁ గస్తూరి బొట్టు
తాల్చి, శేషశయ్యఁ బరుండి, తన్వి సీత
తోడ, నానందరూపుఁడై వేడుకలర
రామ ! చెలువొందుచున్నావు; ప్రార్థనంబు
సల్పి, వినుతింతు నీ గుణజాలములను
నాదు భయములఁ బాపు మానందపురుష !

– ౨

ఉపనిషత్తుల శ్రీరామ ! యున్న వాఁడ
వరయఁ గారణనామంబుఁ బరఁగఁ దాల్చి
దివ్యమగు విమానంబున – నవ్య శేష
శయ్యయందుఁ గూర్చున్నట్టి సారసాక్ష !
శ్రీ పరంధామ మూర్తివై చెలఁగి నావు :
ఇతర ద్వైవంబు సేవింప కేను సతము
నిన్నె సేవింతు సేవింతు నిశ్చయముగ
నన్ను రక్షింపు శ్రీరామ ! నాగశయన !

– ౩

పరఁగ శేషాచలమునందు, వరవిమాన
మున, సుయోగపీఠంబున – ముదము చెలఁగ
వాస మొనరించి, మానిహృత్పద్మములకు
సాతసంబుఁ జేకూర్చెడి సత్ప్రభుండ
వెపుడు, భూజాత సేవల నింపుగాఁగఁ
గొంచు, నోంకార రూపుఁడై కోమరు
మీఱు
రామ ! నిన్నె ధ్యానింతును రక్తితోడ
నన్ను రక్షింపు శ్రీరామ ! సన్నుతాంగ !

– ౪

మనసున నున్నావు మనసులోపల కూడ
మలయాడుచున్నావు మాననీయ !
ఆద్యంతరూపుఁడై–యఖిలంబును, ప్రకాశ
వంతంబుగాఁ జేయు ప్రభువరేణ్య !
నీ రూపుఁ జింతింప నేరము ; మధ్యస్థుఁ
డై, ఈశ్వరుండైన–యఖిల వేద్య !
బుద్ధికి, మానసమునకుఁ జిత్తమున, క
హంకార మనెడి జాడ్యంబునకును

సాక్షియైనట్టి శ్రీరామ ! సార్వభౌమ !
భజన సల్పెద సతతంబుఁ బరమభక్తి
నాదు లోపంబులను బాపి సాదరమున
రక్షసలుపుము దేవ ! శ్రీరామచంద్ర !

౯౫
ఆనందుఁడై, పరమానంద రూపంబు
లకు, మేటిసాక్షివై - లలిత చరిత!
రామచంద్రుఁడ! పరబ్రహ్మరూపుండవై
జ్యోతిస్వరూపుఁడై - సుందరాంగ;
పార్వతీ ప్రియుఁడయి - బరగు నీశ్వరునిచే
సేవింపఁబడుచున్న శ్రీవిలాస!
శ్రీ పరంధామ! భజింతును సతతంబు
నిర్మల భక్తిచే నీరజాక్ష!

కలుషమెల్లఁద్రుంచి, కష్టముల్ దొలగించి
శిష్టసేవ సలుపు చిత్తమొసఁగి
రామచంద్ర! నన్ను రక్షింపుమయ్యా, నీ
పాద పద్మములకుఁ బ్రణుతిసేతు.

౯౬
వాసుదేవ! పరాత్పర! భవ్యనామ!
సర్వకారణభూత! తేజస్వరూప!
పరమ పావన! సర్వేశ! పంకజాక్ష!
త్రిగుణముల చేతఁబూజలందెదు, ముకుంద!
తామసగుణంబున, కతీతుఁడై, మహాత్మ
వెలుఁగు చున్నావు రామ! సేవింతు నిన్ను

౯౭
సాకేతపురములో - సౌవర్ణసింహాస
నంబుందు; నయ్యాది యగరు గంధ
ధూపంబు లన్నిండి - తోరంబుగాగ - మా
ణిక్య దీపములచే నెగడు చుండు
ఘనసార, కుంకుమ - కస్తూరి వాసనల్
వెదజల్లు పుష్పముల్ వేన వేలు
వివిధ రకంబులు విలసిల్లు నా పీఠ
మందుఁగూర్చున్నావు సుందరాంగ!
మన్మథునకు, మన్మథుఁడవై - మహిమమీఱి
నీలమేఘ శరీర! శ్రీ నిగమ వేద్య!
ప్రభల వెలుగొందు తారకరామ! నిన్ను
ధ్యాన మొనరింతు సతతంబు తమక మెసఁగ

౯౮
అమృత సముద్రంబు-యధికోన్నత తరంగ
యుక్తంబు శ్రీకర ముక్తిదంబు;
తన్మధ్యమందు, శ్వేతద్వీపమొందు, క
ల్పకములచేఁజుట్టఁబడి, వెలుంగు
కర్పూర దీపప్రకాశమానంబైన
యోంకార గృహమందు నొప్పుచున్న
శేష పర్యంకాన, శ్రీలక్ష్మితోఁగూడి
చెలువొందుచున్నావు శ్రీ రమేశ!

సారమా, జ్ఞానసుఖముల స్థానమైన
శ్రీ విరాట్స్వరూపుండగు - శ్రీనివాస!
రామ! తారక నామ! సంరక్షణంబు
సలుపుమా - ప్రార్థన మొనర్తు సంతతంబు.

౯౯
వైకుంఠ పురములో, శ్రీ కాంత! కల్ప వృ
క్ష స్థలమొందు, శృంగారమైన
బహురత్న మయములౌ ప్రాకారముల
చేతఁ
జుట్టఁబడియు నుండు సొబగు మీఱి

చంద్రకాంత మణుల సౌరుతోఁ దన్మధ్య
 సౌధంబు దనరారు సలలితముగఁ
బూ బాన్పుమంచంబు ప్రోదిగా విలసిల్లు
 నందుం, శేషశయ్యను, ముకుంద!
లక్ష్మి మొదలగు వారిచే లాలితముగఁ
బూజలందుకొని, పరుండి మోహనాంగ!
రామ! తారక నామ! విభ్రాజమాన
ముగ, వెలింగెదు! సేవింతు ముక్తినిమ్ము.

౧౦౦

వైకుంఠ పురములోపలను; మాణిక్య, వి
 రాజితంబైనట్టి ప్రాంతమొందు
చంద్ర పీఠంబందు సౌరుగా వెల్గు; నం
 దష్టాంత పద్మంబునందు, చంద్ర
బింబంబు నందుండి వెడలెడి యమృతోద
 క ప్రవాహ మొకటి గ్రాలుచుండు
నా మధ్య - సూర్యచంద్రాగ్నిమండల
 ముందు
 నా మండలంబున, యాదిశేషు
శయ్యపై బండియున్నావు సారసాక్ష!
ఇంద్రనీల శోభిత దేహ! ఇనకులేశ!
రామ! తారకనామ! విశ్రాంతిలేక
నిన్నె భజియింతు; రక్షింపు సన్నుతాంగ!

(సశేషము)

# ప్రేమే దైవం, దైవమే ప్రేమ అన్న సర్వమత సిద్ధాంత సారంతో నింపిన అమృత హృదయిని హెలెన్ కెల్లర్

**(టి. డి. మాణిక్యం)**



"నేను అధ్యాపకురాలనూ కాదు, బోధకురాలనూ కాదు, లోకంలో వికలాంగులపై పరమాత్ముడు ప్రసరింపజేసే జ్యోతిని గమనించే ఒక ప్రేక్షకురాలని మాత్రమే" అంటుంది డాక్టర్ హెలెన్ కెల్లర్.

ఆమె 1955 లో భారతదేశం సందర్శించిన సందర్భంలో ప్రధాని నెహ్రూ ఈ అద్భుత విదుషీమణి "భారత వర్షానికి అమెరికా బహుమతి" అని వర్ణించారు.

డెబ్భై ఎనిమిది సంవత్సరాల ప్రాయపు ఈ వృద్ధ బధిరాంధ విద్యాధని, గ్రంథకర్త, వికలాంగుల సమస్యల పట్ల ప్రజల దృష్టిని ప్రసరింపజేయటానికి, ఆ సమస్యల పరిష్కార మార్గాలను ప్రపంచానికి బోధించే నిమిత్తం అయిదు పర్యాయాలు భూగోళాన్ని చుట్టివచ్చింది.

హెలెన్ 1880 జూన్ 27 వ తేదీన ఉత్తర అలబామాలో ఒక చిన్న బస్తీలో జన్మించింది. పుట్టిన ఒకటిన్నర సంవత్సరంవరకూ బాగానే ఉంది. ఇంతలో జబ్బు చేసింది. ఆ జబ్బులోని ఆమెకు అంధత్వం, చెవిటితనం ప్రాప్తించటంతో పాటు నోరుకూడా పడిపోయింది. మూగదయింది.

ఆమెకు పంచేంద్రియాలలో రెండు ఇంద్రియాలు లోపించినప్పటికీ మిగిలిన మూడు ఇంద్రియాలు — స్పర్శ, జిహ్వా, ఘ్రాణేంద్రియాలు — మాత్రం అద్భుతంగా పని చేస్తున్నవి. ఈ మూడు ఇంద్రియాలే పంచేంద్రియాలు చేసేపని చేస్తున్నవి

ఆ నాటి విషాద సంఘటన నేటికీ ఆమె బాల్య స్మృతులను చెరిపివేయలేక పోయింది. బాల్యంలో తప్పటడుగులు వేస్తూ చూచిన సువిశాలమైన పచ్చిక బయళ్లు, తేజోవంతమైన నీలాకాశం, తరు, పుష్ప లతాదులు ఆమె స్మృతి పథంలో శాశ్వతంగా ముద్ర వేసుకొన్నవి. అయినా, విషయ గ్రహణకు అసాధారణ పద్ధతులు అవలంబించవలసి వచ్చేది. ప్రతీవస్తువునూ స్పర్శ ద్వారా గ్రహిస్తుంది. ప్రతి కదలికను మెదలికను గమనించగలుగుతుంది. మూక సంజ్ఞలద్వారా ఫ్రిజర్ పనిచెయ్యటం, వణకటం వంటి సైగలుచేసి తనకు ఐస్ కావాలని తెలియ జేస్తుంది.

హెలెన్‌కు ఆరేళ్ల వయసు రాగానే తలిదండ్రులు బాల్టిమోర్ (మేరీలాండ్)లో ఒక సుప్రసిద్ధుడైన వైద్యుని వద్దకు ఆమెను తీసికెళ్లారు. ఆ వైద్యుడు టెలిఫోన్ కనిపెట్టిన అలెగ్జాండర్ గ్రహాంబెల్ సలహా తీసుకోమని సూచించాడు. అలెగ్జాండర్ గ్రహాంబెల్ భార్య చెవిటిది. భార్య చెవుడు పోగొట్టటానికని ఆయన ఒక యంత్రం కనిపెట్టాడు. ఆ యంత్రం కనిపెట్టే ప్రయత్నంలోనే టెలిఫోన్ కనుగొన్న ప్రజ్ఞాశాలి.

హెలెన్ తలిదండ్రులు ఆయన సలహా తీసికొన్న ఫలితంగా బోస్టన్‌లో సుప్రసిద్ధ అంధుల పాఠశాల అయిన పెర్కిన్స్ ఇన్‌స్టిట్యూట్‌నుంచి ఒక ఉపాధ్యాయిని రావించబడింది. అది 1887 మార్చి నెల. మిస్ ఏనీ సలివాన్ అనే ఒక 20 ఏండ్ల వనిత కెల్లర్ ఇంటికి వచ్చింది.

తన జీవితంలో అతి ముఖ్యమైన చిరస్మరణీయమైన దినంగా హెలెన్ వర్ణించింది. తన ప్రేమపాత్ర

మైన ఈ "ఉపాధ్యాయిని" 1936 లో మరణించింది. అంతవరకు వీరిద్దరూ ఎడబాయని జంటగా మెలిగారు. ఆ నాటినుంచీ హెలెన్ తన తపస్సును మరింత దీక్షతో, కఠినంగా కొనసాగించింది. ఆమె కృషిలో తన సహచారిణి, కార్యదర్శి మిస్ పాలీ థామ్సన్ తోడ్పడింది.

హెలెన్ తొలి ఉపాధ్యాయిని మిస్ సలివాన్, తన శిష్యురాలి ధైర్యం, సాహసం, చొరవ, చూచి అచ్చెరువందింది. పాఠాలు ప్రారంభించిన తొలినాడే హెలెన్ చేతిలో ఉంచిన కొయ్య అక్షరాలను ఉచ్చరించటం ఆరంభించింది. కొలది మాసాల్లో హెలెన్ 800 మాటలు నేర్చుకొన్నది. మామూలు కాగితంమీద అంధులు చదివే పుస్తకం (బ్రెయిలీ) మీదా వ్రాయటంకూడా నేర్చింది. హెలెన్ విజ్ఞాన తృష్ణ అపారం. సాధించిన అభివృద్ధి అద్భుతం; అలబామాకు వెళ్లిన మూడు మాసాలకే సలివాన్ ఒక స్నేహితురాలికి వ్రాసిన లేఖలో ఇట్లా నుడివింది "ఈ బాలిక విద్యాబోధన నా జీవితంలో ఒక ప్రత్యేక సన్నివేశమవుతుందని నాకు తెలుసు. ఈమెలో అత్యద్భుత శక్తులున్నవి. ఆశక్తులను సానబట్టి సద్వినియోగంలోకి తేగలననే సంపూర్ణ విశ్వాసం నాకున్నది."

హెలెన్. తనకు పదేళ్లురాగానే మాట్లాడటం నేర్చుకోవాలనే కృతనిశ్చయురాలయింది. ప్రారంభంలో ఆమె ఉచ్చరించిన నూరు మాటల్లో ఒక్క మాటగూడా స్పష్టంకా తెలిసేది కాదు. అయినా ఆమె నిరుత్సాహపడలేదు. రాత్రింబవళ్లు కష్టపడింది. ఒక్క మాటనే గంటల తరబడి అనేది. ఆ మాటను క్షుణ్ణంగా ఉచ్చరించగలిగేటంతవరకూ సాధనచేసేది. ఆమె స్వరం అదుపులో ఉండేది కాదు. ఒక్కొక్కసారి ఎదటి మనిషికి వినపడనంత తక్కువ స్థాయిలో ఉండేది. ఒక్కొక్కసారి వెర్రి కేకలాగ వినిపించేది. అయినా ఆమె మానవ సాధ్యమైనంతవరకూ సాధించింది.

తర్వాత రాడ్‌క్లిఫ్ కళాశాలలో పట్టభద్రురాలయింది. రచనలో, ఉపన్యాసాలివ్వటంలో, ఆవిడి వాళ్ళకు సేవచెయ్యటంలో ఖ్యాతిగడించింది.

హెలెన్ కెల్లర్, తన అసౌకర్యాలను, అవిటితనాన్ని అధిగమించటంలో తోడ్పడిన అనేకమందికి ఎంతో ఋణపడి ఉన్నానంటుంది. సర్వమత ధర్మాల సారాంశమే ఆమె సిద్ధాంతం. ప్రేమ ఉన్నచోటే దేవుడుంటాడు. దేవుడున్నచోటే ప్రేమ ఉంటుంది. ఇదే ఆమె మతం.

నిస్సహాయులై పడి ఉన్న వికలాంగులకు స్వయం సహాయులైన ప్రయోజనకరమైన పౌరులుగా రూపొందగల అవకాశాలను సాధించగల అద్భుతాన్ని ఆమె చవిచూచింది. తనమట్టుకు తనకు విశ్రాంతి అనేది దాదాపు అసాధ్యమైన పని. తన ప్రజాసేవారంగం — తన అంతరంగిక జీవితంతో అతి సన్నిహితంగా ముడిపడి ఉన్నది. రెండు అంధుల వితరణ సంస్థలకు సలహాదారుగా తన పదవిని విరమించినా ఆవిడ తన ఉత్తర ప్రత్యుత్తరాలు వగైరా నిమిత్తం దినం 8 గంటలనుంచి 10 గంటల దాకా పనిచేయవలసి వస్తున్నది.

ఆమెకు వచ్చే లేఖలు అనేక రకాలుగా — తమాషాగాకూడా ఉంటవి. తమకేదైనా చేసి పెట్టమని కొందరు వ్రాస్తుంటారు. హెలెన్ కెల్లర్‌కు తమ నేత్రాలలో ఒకదాన్ని ఇవ్వటానికి సిద్ధంగా ఉన్నామనీ, ఆ విధంగా మార్పు చేసుకొనే అవకాశం ఏదైనా ఉంటే — మంచి నేత్రాలతో ఆమె ఇంకా ప్రపంచానికి మంచి చేయాలని తమ అభిలాష అనీ కొందరు వ్రాస్తుంటారు.

ఆ వయసులో అంతటి బ్రహ్మాండమైన సేవ చేయగలవారు అరుదుగా ఉంటారు. ఆమెది సర్వకాల స్వాస్థ్యం గల దృఢమైన ఆరోగ్యం. మొక్కపోని ఉత్సాహం. ఆమె సడలని ఆశావాది. "అన్ని అవయవాలు సక్రమంగా ఉన్నవారు కొందరు నన్ను చూచి జాలిపడుతూ ఉంటారు. అయితే నా ముందువారు చూచే చీకటిని ఛేదించడానికి నా హృదయంలో ఒక అద్భుతజ్యోతి ఉన్నది ... నాలోని విశ్వాసమే నాకు వెలుగు చూపుతుంది" అంటుందామె.

# గృహలక్ష్మీ ప్రశంస

శ్రీమతి వాజపేయయాజుల మహాలక్ష్మి

నీకుఁ గేసరి జనకుఁడు
ప్రాకట కీర్తిఁ గొనిన సరస్వతి చెలిక
త్తె కడుముద మిచ్చుఁ గద
యేకొఱతయు నైన గల్గునే? గృహలక్ష్మీ!

నీ విడుకంకణంబు ధరణీతలమంత సమాన
మంచు మో
దావహ మంచుఁ బల్వురకు నంచితమార్గముఁ
జూపు నంచు దీ
క్షావ్రతభక్తి పెంపున సమస్తములోక
మెఱుంగునట్లుగాఁ
జేవఁ గలట్టి వ్యాసముల చేత సరస్వతి చాటి
చెప్పదే?

నీవును గోడలు శ్రీ మై
శ్రీ విభవం బెసఁగ నుంటఁ జిరముగ
నుండెన్
పావనమైన యశంబును
లావణ్య శ్రీలును గృహలక్ష్మి తనయా!

ప్రేషిత వరగృహలక్ష్మికి
భాషా శ్రీ శోభితాంగి వరకృపచే సం
తోషము గల్గుఁ గవితా
పోషితవర్గము పొగడఁగఁ బూజ్యులు
మెచ్చన్

అందుఁగ వితత్వముల యందము
కొంత విచిత్ర శిల్పితోఁ
బొందుగ నందు చిత్రముల పొందిక
కొంత; కళావిభూతిలోఁ
జందము కొంత, నాట్యకళ సంపద కొంతఁ
గనంగ నయ్యెడిన్
డెందమునందు సంతసము నెక్కొను
గాదె? పఠించుచుండఁగన్

మాతృభూమిలో మొదటి జన్మంబు నీది
స్త్రీల పాలిఁటి రత్నంబై గ్రాలుచుండె
నగ్రతాంబూలమును గాంచి యాంధ్రభూమి
మనుము సూర్యచంద్రాదులు తనరుదాక

# విమల

శ్రీమతి డి. వాణి

రాత్రి ఎనిమిదైంది. ప్రకాశరావు అప్పుడే భోజనముగించి డాబామీద చల్లగాలికి పచారు చేస్తున్నాడు. ఇంతలో అతనికి, 'ఎ. బి. సి. డి...' అని చెప్పే విమల కంఠ స్వరమూ, పాపవాటిని పలకడమూ వినబడింది. చటుక్కున అతని ఆలోచనలు విమలవైపు తిరిగాయి. విమలదేవత! తనకోసం — ఆమె సర్వస్వాన్నీ విడిచిపెట్టింది! ఆమె దెంత ఉత్కృష్టహృదయం కాకపోతే తనంటే యిష్టంలేక పోయినప్పటికి పెళ్ళి చేసుకొని తన సంసారంకోసం పాటుపడుతూంది! మొదటిసారి తను జయకు ద్రోహం చేయడమే కాకుండా, రెండవసారి విమలనుకూడ నాశనం చేయ బూనుకున్నాడు! కాని ... కాని తన అర్థంలేని, కారణంలేని పగ స్నేహితుడి మాటలు విన్నతరువాత, గత జీవితంలోని సంఘటనలు తల్చుకొన్న తరువాతనే అణిగింది! ఇక — విమలకళ్లలో నీళ్లు తను చూడరాదు! సంసారంలో ఆనందం నెలకొల్పాలి! తనకోసం త్యాగం చేసిన విమలను బాధ పెట్టకూడదు!

◆ ◆ ◆

జయ, విమల వకీలు శ్రీనాథంగారి పుత్రికలు. ఇద్దరూ అందంగా ఉంటారు. శ్రీనాథంగారికి పెద్దరాబడి లేకపోయినా కుటుంబానికేమీ కొరతగా ఉండేదికాదు.

ఒకసారి హైస్కూలు వార్షికోత్సవానికి శ్రీనాథంగారు అధ్యక్షత వహించారు. వ్యాసరచనలో ఆటల్లో, నాటకాల్లో ఫస్టు ప్రైజు సంపాదించుకున్న ప్రకాశరావు అతన్ని చాల ఆకర్షించాడు. ఒంటరివాడైన ప్రకాశరావు స్కాలర్ షిప్ తో చదువుకుంటున్నాడు.

శ్రీనాథంగారిలోని స్వార్థమూ, ప్రకాశరావులోని మంచితనమూ, తెలివితేటలు యిద్దర్నీ అప్తుల్ని చేశాయి. 'నా' అనేవారు లేని ప్రకాశరావుకి ఆ కుటుంబం చూపిన ఆదరణ శాంతిని కలిగించింది. ప్రకాశరావు చదువు భారం తనపైన వేసుకున్నారు. ప్రకాశరావు ఎమ్. ఏ. ఫస్టుక్లాసులో ప్యాసయాడు. మద్రాసులో ఉద్యోగం దొరికింది. అప్పటికి జయ బి. ఏ. ప్యాసైంది.

శ్రీనాథంగారు వివాహప్రస్తావన తెచ్చారు. జయను వివాహం చేసుకోవలసిందిగా కోరారు. అతని మంచితనం వెనుక స్వార్థం దాగి ఉందని ఊహించని ప్రకాశరావు నివ్వెరపోయాడు. కాని ఆ కోరిక సహజంగా, న్యాయంగా కనిపించింది.

ప్రకాశరావుకి మొదటినించి నల్లనికళ్ల విమలంటే యిష్టం. కాని ఆమె తనకంటె చాల చిన్నది. అంతే కాక తనను మొదటినించి తండ్రిలా ఆదరించిన శ్రీనాథంగారి కోర్కెను తిరస్కరించలేకపోయాడు కొన్నాళ్ళకి అతనికీ జయకీ వివాహం జరిగిపోయింది ఇద్దరూ మద్రాసు వెళ్ళిపోయారు.

◆ ◆ ◆

జయకు కూతురు పుట్టింది. ఇంకొక సంవత్సరానికే మరొక పాప కలగడం, జయ ఆరోగ్యం దెబ్బతినడం జరిగింది. ఎన్నిమందులిచ్చినా లాభంలేకపోయింది. చివరకది క్షయవ్యాధని తేలింది.

శ్రీనాథంగారు జయ అనారోగ్యం సంగతి విని చాల బాధ పడ్డారు. వెంటనే వచ్చి ప్రకాశరావు కుటుంబాన్ని తనతో తీసుకెళ్లిపోయారు. ప్రకాశరావుకి ఆ ఊళ్ళోనే లెక్చరర్ పోస్టు లభించింది.

మంచం పట్టిన జయ యెప్పుడూ పడుకునే ఉండేది. విమల, తల్లి పాపలను చూసుకునేవారు. అప్పటికి విమల ఇంటరు చదువుతూనే ఉండేది. కాలేజీలో అందరికీ విమలంటే యిష్టం. అందరితో సరదాగా మాట్లాడే విమల ప్రకాశ

రావుతో ముభావంగా ఉండేది. ప్రకాశరావు యెన్నో సార్లు ఆమెను మాట్లాడించాలని ప్రయత్నించి విఫలుడైనాడు. క్రమంగా ప్రకాశరావుకి విసుగెత్తసాగింది. దగ్గుతూ పడుకునే భార్య, ఏడ్చే పిల్లలూ అతనికి విసుగుకలించేవారు. ఎప్పుడూ భార్యను పిల్లలను కసురుతూ ఉండేవాడు. జయకు చాల బాధగా ఉండేది. ప్రకాశరావు యెప్పుడూ విమల సంగతులు చెప్పడంవలన అతనికి విమలపై అనురాగం ఉన్నదని జయ గుర్తించింది.

ప్రకాశరావుని భార్య జబ్బు, విమల మౌనం పిచ్చివాడినిచేసేవి. సదా విమల సుందరరూపమే అతని కళ్లముందు మెరిసేది. ఏమైనా విమలను తన దాన్నిగా చేసుకోవాలనే కాంక్ష తీవ్రంగా ప్రబలింది. ఆ పరిస్థితిలో అతను యుక్తాయుక్త విచక్షణాజ్ఞానం కోల్పోయాడు.

ఆ రోజు రాత్రి విమల తన రూములో చదువుకుంటోంది. ప్రకాశరావు ఆమె గదిలో అడుగు పెట్టాడు.

'విమలా' బావ కంఠస్వరంవిని ఆమె త్రుళ్ళిపడింది. ఆమెకు మొదటినించి అతని ప్రవర్తన నచ్చలేదు. ఆ సమయంలో అతన్ని చూచి నివ్వెఱపోయింది.

'ఏమిటి బావా?' అని అడిగింది తడబడుతూ.

'నా సర్వస్వం నీవే విమలా! మీ యింట్లో అడుగు పెట్టినప్పటినుంచి నిన్నే ప్రేమిస్తున్నాను. కాని మీ నాన్న కోర్కె కాదనలేక జయను వివాహం చేసుకున్నాను. ఆమె జబ్బు నయమయే సూచనలు కనబడటంలేదు. ఆమెకోసం నా జీవితాన్ని వృథా చేసుకోలేను. మనం యెక్కడికైనా వెళ్ళిపోయి పెళ్ళి చేసుకుందాం' చటుక్కున ఆమె దగ్గరగా వెళ్లాడు. విమల అదిరిపోయింది. ప్రేమించి అతని ఆనందంకోసం పాటుపడిన జయకెంత ద్రోహం తలపెడుతున్నాడు!

'ఏమంటావు విమలా?' ప్రకాశరావు తిరిగి ప్రశ్నించాడు. ఆ క్షణమే అతని చెంప ఛెళ్లుమంది. 'నీకోసం జీవితాన్ని ధారపోసి నీ ఆనందంకోసం పాటుపడిన భార్యకింత ద్రోహం తలపెడతావా? కేవలం ఆమె జబ్బుపడినంతమాత్రాన పసిపాపలను, ఆమెను నిరాధారంగా వదిలేసి స్వార్థంతో పరిగెడదామని చూస్తున్నావా? దిక్కులేని నిన్ను ప్రేమించి నీ ఉన్నతికి పాటుపడిన అత్త మామలకు చూపవలసిన కృతజ్ఞత యిదేనా? ఈనాడు నీవు నా రూపాన్ని చూచి మోజు పడుతున్నావేమో? కాని రేపు నాకు కూడ యిటువంటి పరిస్థితి యేర్పడితే నన్నూ నాశనం చేయవూ? ఒకవేళ నీవే అస్వస్థతతో మంచం పడితే నీ భార్య వదలివెళ్ళితే నీ పరిస్థితి యెలా ఉంటుంది? జయ అమాయకురాలని యీ విధంగా ద్రోహం తలపెడతావా?' ఆఖరి మాటలంటూంటే ఆమె కంఠం రుద్ధమైపోయింది. జయ దీనస్వరూపం కళ్ళముందు మెదిలేసరికి ఆమెకు దుఃఖం పొంగుకొచ్చింది. ప్రకాశరావు కోపంతో, అవమానంతో దహించుకుపోయాడు. విసురుగా, కసిగా బైటికి వెళ్ళిపోయాడు. విమల బాధతో యేడుస్తూ కూర్చుండిపోయింది.

◆ ◆ ◆

జయకు ప్రకాశరావు మనస్సు పూర్తిగా అర్థమైపోయింది. తను అడ్డుగా ఉన్నట్లు బాధపడసాగింది. తనవలన ప్రకాశరావు యిక సుఖపడే యోగ్యతలేదు. పాపలగతి యేమవుతుంది! ఇవే ఆలోచనలు ఆమెను బాధించేవి. ఆమె పూర్తిగా కృశించిపోయింది.

ఒకరోజు యెవరూలేని సమయంలో విమలను పిల్చింది.

"బావంటే నీకిష్టమేనా విమలా?" జయ ప్రశ్న విని విమల చకితురాలైంది. ఆమె కళ్లు నీళ్ళతో నిండాయి. విమల సిగ్గుపడుతూందని జయ భావించింది. ఆమె కన్నీళ్ళలోంచి బరువుగానవ్వి నీరస హస్తంతో ప్రేమగా విమల తల నిమిరింది.

'బావ జీవితం నావలన వృథా కావడం నాకిష్టం

లేదు. ఇక నేను బ్రతికే ఆశా లేదు. అందుచేత నీవే అతన్ని పెళ్ళిచేసుకొని అతని జీవితాన్ని సుఖవంతం చేయాలి. అతనికి నీవంటే యెంతో ప్రేమ. నా పాపలిద్దరూ తల్లిలేని వాళ్ళనిపించుకోకుండా చేయాలి. ఏ పరాయివారి చేతుల్లో నాభర్తా, పిల్లలూ బాధపడటం నాకు సహించరానిది. అతని ప్రేమకు పాత్రురాలవైన నీవైనా సుఖపడి, అతన్ని సుఖపెట్టగలిగితేనే నా ఆత్మకు శాంతిగా ఉంటుంది విమలా!' జయ నిట్టూర్చింది. జయకు ప్రకాశరావుపైగల ప్రేమకు విమల తెల్లబోయింది. ఇంతగా ప్రేమించే భార్యంటే ప్రకాశరావు కెంత నిర్లక్ష్యం? అతనామెకు ద్రోహం తలపెట్టినా అతని సౌఖ్యంకోసం జయ యెంత తపిస్తూంది! కాని తను! ప్రకాశరావుని వివాహం చేసుకోవడమా! తనెంతో అసహ్యించుకునే ప్రకాశరావుకి భార్యకావడం కంటె దుర్భరత ఉందా?

'విమలా.' జయ కన్నీళ్ళతో ఆత్రుతగా విమలవైపు చూసింది. విమల ఒక్కసారి కళ్ళు మూసుకుంది. అవును! అక్క మాటలు నిజం! అక్క పాపలు బాధపడరాదు! అక్కకోసం, పాపలకోసం తను ప్రకాశరావుని పెళ్ళి చేసుకోవాలి! తన స్వార్థాన్ని చూసుకోకూడదు!

'అలాగే అక్కయ్యా!' విమల అంగీకారం సూచించింది. జయ సంతోషంతో, 'నీకు తప్పక మేలు కలుగుతుంది విమలా!' అంటూ విమల చెక్కిళ్లు ఆప్యాయంగా నిమిరింది.

♦ ♦ ♦

ఇది జరిగిన నాల్గవరోజునే జయ శాశ్వతవిశ్రాంతి తీసుకుంది. శ్రీ నాధంగారు, భార్య ఘోరంగా విలపించారు. ఏడ్చే పాపలిద్దర్నీ ఒడిలోకి తీసుకుని విమల బాధతో కన్నీళ్ళు తుడుచుకుంది.

కొన్నాళ్లు గడిచిపోయాయి. ఆ యింట్లో ఆనందమే కరువైపోయింది.

ఆ నాటి ఉదయం శ్రీనాధంగారు యేదో వ్రాసుకుంటున్నారు. ఇంతలో 'నాన్నా!' అనే పిలుపు వినబడి తలెత్తారు. విమల గోడ కానుకుని నిల్చుని ఉన్నది.

'ఏమమ్మా!' ఆప్యాయంగా అడిగారు.

'నేను బావను పెళ్ళిచేసుకుంటాను నాన్నా!' విమల తన ఉద్దేశ్యాన్ని సూటిగా తెలిపింది. శ్రీనాధంగారు ఆశ్చర్యపోయారు.

'బావ నీకంటె చాల పెద్దవాడు విమలా! మనకి డబ్బులేనంత మాత్రాన నీవీ విధంగా చేయవద్దు. నా శాయ శక్తులా ప్రయత్నించి నీ జీవితం సుఖవంతంచేస్తాను,' అన్నారు. అతని కళ్ళు నీళ్ళతో నిండాయి.

'నేనేవిధంగానూ కష్ట పడను. అక్క పాపలను వదిలి ఉండలేను నాన్నా! నేను బావనే చేసుకుంటాను. దీవించండి,' అని వంగి తండ్రిపాదాలకు నమస్కరించింది.

'నీకు సంతోషంగా ఉంటే నాకేమీ అభ్యంతరం లేదమ్మా' అన్నారు.

విమల తల్లితో చెప్పేసరికి ఆమె తెల్లబోయింది.

'వద్దమ్మా!' అని మాత్రం అనగలిగింది. కాని విమల నిశ్చయంగా చెప్పేసరికి ఆమె యేదురాడలేకపోయింది.

ప్రకాశరావు యీ సంగతివిని చాల ఆశ్చర్యపడ్డాడు. విమలపై కసి తీర్చుకొందుకు మంచి అవకాశం దొరికిందని భావించాడు.

పెళ్ళిచాల సామాన్యంగా జరిగిపోయింది. ఆశ్చర్యపడి అడిగిన ఫ్రెండ్సుకి చిరునవ్వే సమాధానంగా యిచ్చింది. ప్రకాశరావు విమలను, పాపలను తీసుకొని మద్రాసు వెళ్లిపోయాడు.

♦ ♦ ♦

ప్రకాశరావు విమలను బాధించడమే కర్తవ్యంగా

పెట్టకున్నాను. ప్రతి చిన్న విషయానికి విమలను కసిరి బాధ పెట్టేవాడు. ఆమె దిగులుగా ఉన్నట్లు కనబడితే, 'కోరి చేసుకొని విచారమెందుకో?' అని నిర్లక్ష్యంగా అనేవాడు.

ప్రకాశరావు యేమన్నా విమల లక్ష్యపెట్టకుండా పాపల నెంతో ప్రేమతో చూచుకునేది. 'పిన్నీ! పిన్నీ' అంటూ పాపలిద్దరూ యెప్పుడూ ఆమె చుట్టూ తిరిగేవారు. పాపలకేమాత్రం ఒంట్లో బాగులేకపోయినా విమల సరిగా చూడటంలేదని అనేవాడు. విమల చాల బాధపడేది. ఒకనాడు తనను వివాహం చేసుకోమని ప్రార్థేయపడిన ప్రకాశరావులోని మార్పుకి విమల క్రుంగిపోయింది.

ఒకసారి విమలకు జ్వరం వచ్చినప్పుడు ఐదేళ్ళ పాప తండ్రితో 'పిన్నికి జ్వరంగా ఉంది. డాక్టరుని తీసుకురా నాన్నా!' అన్నది అమాయికంగా. ప్రకాశరావు మండి పడ్డాడు.

'రోగాలకు పెట్టడాని కిక్కడెవరూ సంపాదించి పోయలేదు,' విసురుగా అంటూ పాప చెంప ఛెళ్లు మనిపించాడు. పాప విమల ఒడిలోపడి ఏడవసాగింది. విమల కళ్ళలో నీళ్లు తిరిగాయి. తమ కుటుంబములోని వ్యక్తిగా మసలిన ప్రకాశరావేనా యీ మాటలనేది?

'అనవసరంగా పాపనెందుకు కొడతారు?' హీన స్వరంతో అన్నది.

'నాయిష్టం. నా కూతుర్ని నే నేమైనా చేసుకుంటాను. అడిగే హక్కు నీకులేదు,' పిచ్చిగా అరిచాడు.

'పాప తల్లినైన నాకు తప్పకుండా అడిగే అధికారంవుంది. అకారణంగా ద్వేషంతో పసి హృదయాల్ని గాయపరిచే హక్కు యెవరికీలేదు,' తీవ్రంగా అన్నది. ప్రకాశరావు త్రుళ్ళిపడి ఆమెకళ్ళలోకి చూసి మొహం త్రిప్పుకున్నాడు.

'బావా', మధురస్వరం విని తిరిగి చూశాడు.

'మీ జీవితాన్ని, పాపల భవిష్యత్తును సుఖమయం చేయడమే నా జీవిత లక్ష్యం. నా కేవరిమీదా కక్ష, ద్వేషం లేవు. నన్ను అర్థం చేసుకోరూ!' అంటూంటే విమల కళ్ళలో తొణికిసలాడే ప్రేమని, వాత్సల్యాన్ని చూడలేక తలవంచుకొని వెళ్ళిపోయాడు.

విమల బరువుగా నిట్టూర్చింది.

ఆరోజు కాలేజిలోకూడ ప్రకాశరావుని విమల మాటలు వెన్నాడుతూనే ఉన్నాయి. సాయంత్రం అకస్మాత్తుగా ఒక ఫ్రెండుని కలిశాడు. కొన్ని సంగతులయాక, 'విమలను భార్యగా పొందగలిగిన నీవు చాల అదృష్టవంతుడివి ప్రకాశం!' అన్నాడు. ఎదురు చూడని యీ కాంప్లిమెంటు విని ప్రకాశరావు తెల్లబోయాడు.

'విమలా, మా చెల్లెలూ క్లాసుమేట్సు. త్యాగంలోనే నిజమైన సౌఖ్యం ఉందని, యెదుటివారి సౌఖ్యంకోసం పాటుపడటంలోనే మానవత్వం ఉందని చెప్తూ ఉండేది. అందుకే తన చదువునీ, తనను చేసుకుందామని ఆశించిన యెంతోమంది పెద్దయింటి యువకుల్నీ తిరస్కరించి నీ యిల్లాలైంది. నీవు చాల హాయిగా ఉంటున్నావనుకుంటాను. మీ పాపలూ చాల అదృష్టవంతులే', స్నేహితుడు అభినందిస్తూంటే ప్రకాశరావు ముగ్ధుడైపోయాడు. అవును! అతని మాటలు అక్షరాలా నిజం! తన ప్రవర్తన నచ్చకపోయినా, తను యే విషయంలోనూ ఆమెకు తగినవాడు కాకపోయినా తనను వివాహం చేసుకుంది! తన సంసారంకోసం పాటుబడుతూంది! ఆ సంగతి తెలిసికూడ తన నా నాడు యేదో అన్నదని బాధ పెడుతున్నాడు! తనెంత మూర్ఖుడు! అతని మనస్సు ఆవేదనతో నిండిపోయింది. గబ గబా యింటికి

పోయాడు. విమల పాప లిద్దరినీ చెరొక ప్రక్కన కూర్చోబెట్టుకొని పాఠాలు నేర్పుతూంది. దృశ్యం కనుల పండువుగా కనబడింది. కాని మాట్లాడలేక మౌనంగా వెళ్ళిపోయాడు.

♦ ♦ ♦

'ఎ, బి, సి, డీలన్నీ వచ్చేశాయి పిన్నీ,' పాప కంఠం వినబడింది.

'చాల రాత్రయింది. పడుకో పాపా!' విమల కంఠంలో తొణికిసలాడిన వాత్సల్యాన్ని మొదటిసారిగా గుర్తించగలిగాడు ప్రకాశరావు. ఇక ఉత్కంఠ ఆపుకోలేక క్రిందకు వెళ్లాడు.

పాప లిద్దరూ నిద్రపోతున్నారు. విమల సోఫాలో కూర్చొని పుస్తకం చదువుకుంటోంది. సౌందర్యంతో వెలిగిపోయే ఆమె ముఖం కళావిహీనంగా ఉంది. ప్రకాశరావుకు చాల జాలి, బాధ కలిగాయి. చటుక్కున ఆమె చేతులు పట్టుకొని, 'నన్ను మన్నించవూ విమలా!' అన్నాడు. ఆమె తలెత్తి అతని కళ్ళలోకి చూసింది. మొదటిసారిగా అతని కళ్ళలో బింబితమైన నిర్మల ప్రేమ ఆమెను చాల ఆనంద పరిచింది.

'బావా!' అతని హృదయంమీద వాలిపోయింది. ప్రకాశరావు కళ్లు ఆర్ద్రాలయాయి. మొదటిసారిగా నిర్మలమైన మనస్సుతో ఆమెను హృదయానికి హత్తుకున్నాడు.

———

# రాజకుమార్

ఫ్రెంచి మూలం :
అంటోని డె సయంట్-ఎక్సుపేరీ

ఆంధ్రానుకరణ,
డాక్టర్ వి. ఎస్. శర్మ

## ఆకాశాన్నుంచి వూడిపడి వచ్చిన అబ్బాయి కథ

అబ్బాయి వాలకాన్ని బట్టి వాడిమనో భావాలనుబట్టీ చూస్తూవుంటే వాడు మరో ప్రపంచంనుంచి ఈ లోకంలోకి, ముఖ్యంగా నేనిప్పుడు ఏకాకిగా వుండిపోవాలసివచ్చిన ఎడారి మధ్యని వూడిపడ్డాడనే చెప్పవచ్చు నన్ను ఈ సమయాన ఆందోళన పరుస్తూ వున్న ఆలోచనా ప్రవాహాలూ ఇట్లే విధి విరామంలేకుండా ప్రవహిస్తూ వున్నాయి.

వాడు మంచి గట్టివాడై వుండాలి. లేక పోతేనా ఆలోచనలని ఎలా పసికట్టివుండ గలుగుతాడు?

''అంటే నువ్వు నాకు మేకని గీయమన్న మాట. అంతేనా?''

చిన్నబుచ్చుకుంటూ కొంచెం సణుక్కుంటూ నాకేసి చూస్తూ అన్నాడు.

అలాటివాడ్ని సమాధాన పరచటం ఎలాగు? వాడి కోరికను తీర్చాలి. అంతకన్నా గత్యంతరంలేదు! కాని మేకను గీయటం ఎలాగు? నా జన్మలో మేకల బొమ్మలని గీసినవాణ్ణి కాదే! అయితేనేం, కొంచెం సాహసం, ధైర్యంచేసి ఆదరాబాదరాగా రెండు బొమ్మలని గీసి వాడి చేతికిచ్చాను. ఈ బొమ్మలు చిన్నతనంలో నేను గీసిన బొమ్మలకిమల్లే వున్నవి. అబ్బాయి వాటిని ఎగాదిగాచూస్తూ,

''అబ్బే! అబ్బే! ఇవి మేక బొమ్మలు ఎలాగవుతాయి! ఇది ఏనుగ బొమ్మ. అదిగో దాని కడుపులో కొండ చిలువ కనబడుతూవుంది. పాములంటే భయం. ఇక ఏనుగలంటే హడలిపోతాను. అలాటి వాటినా నాకు గీసి ఇయ్యటం? ససేమిరా ఇవి నాకు అక్కరలేదు. మా ఇల్లు చాలా చిన్నది. దాన్లో ఇవి దాచుకోటానికి స్థలం లేదు. ఇవి నాకేం వద్దు. నాకు కావలసింది మేక. చప్పున ఆ బొమ్మని గీసి యిచ్చావా మా ఇంట్లో జాగ్రత్త పరచుకుంటాను. ఏమంటావు?'' ఒక వైపు ఆందోళన పడుతూ, మరొక వైపు అమాయకంగా, చిలిపి చిలిపి చేష్టలతో చిందులు తొక్కుతూ అన్నాడు.

ఇంకోసారిబొమ్మని గీశాను. దానిని వాడికి చూపాను. దాన్ని చూశాడో లేదో, పెదవులను విరుచుకుంటూ ''ఇదేం బాగా లేదు. జబ్బు పడిన జంతువుకి మల్లె వుందే! మరో దానిని గీసి ఇయ్యి.'' అని సణుక్కున్నాడు.

ఆ కాగితాన్ని బరబర చింపివేసి మరో

కాగితంమీద బొమ్మని గీశాను. దాన్ని వాడు యెగా దిగా చూస్తూ ఫక్కున నవ్వాడు. "నువ్వే దీన్నిచూడు...... దీన్ని మేక అని యెలా అంటావు? ఇది పొట్టేలు! అంచేతనే దాని కొమ్ములని అంత పెద్దవిగా గీశావు" అని తనకు ఇలాటి బొమ్మల సంగతి తెలుసు అన్నట్లు నదురూ బెదురూ లేకుండా చప్పున అనేశాడు చప్పట్లు తడుతూ. ఆ నవ్వులతో, ఈ చప్పట్లతో వుక్కిరి బిక్కిరి అయిపోయాను. వాడిని తృప్తి పరచటం యెలా? ఇంకో బొమ్మగీస్తేనో? గీసిన ఆకాగితాన్ని బర బర చింపేసి ఇంకోబొమ్మనిగీశాను. దాన్ని చూస్తూ "నాకు కావాలసింది పిల్ల మేక. నువ్వు గీసింది పెద్ద మేక. ఇవ్వాళో రేపో కళ్లుమూసుకుండే లక్షణాలు దాన్లో ప్రత్యక్షంగా కనబడుతూ వున్నాయి. చాలా కాలం బ్రతికివుండే మేక పిల్ల నాకు కావాలి. అలాటి దాన్నే గీసి ఇయ్యి" అంటూ మారాం చేయటానికి మొదలెట్టాడు.

వాడ్ని తృప్తి పరచటానికి మరి కొన్నిటిని గీశాను. అవి వాడిని సుతారాం తృప్తి పరిస్తేనా! ఈ కార్య కలాపంలో మునిగి తేలుతూవుంటే ఇతర పని పాటలని యెవళ్లు చూసుకుంటారు. అప్పటికే యెంతో యెండ కాస్తున్నది. మోటారు కాదరబందిని చూసుకోవాలి. అంచేత వాడు మారాం చేస్తూవున్నా, నా దృష్టి యంత్రం కేసి, దాని చుట్టు ప్రక్కలనున్న సామానుల కేసిపోయింది. జాజి చెక్క పెట్టెలు వున్నాయి అక్కడ; వాటిలో చిన్న పెట్టెలు వున్నాయి. కొంచెం పెద్ద పెట్టెలు వున్నాయి; వాటిలో ఖాళీపెట్టె నొక దానిని తీసుకుని అబ్బాయి చేతికిస్తూ "ఆ మేకల్లో నీకు నచ్చిన దానిని పుచ్చుకుని ఈ పెట్టెలో దాచుకో," అని అన్నాను. దానితో నా పని పాటలు చూసుకోటానికి వీలు అవుతుందనే వుద్దేశ్యంతో. ఆ మాట అన్నాక వాడి ఆనందాన్ని చూడాలి. ఆ పెట్టెను ఆప్యాయంగా తడుముతూ "దీన్ని నాకు ఇచ్చి వేస్తావా? ముద్దుగా వుంది, మా ఇంటికి తీసుకుని వెళ్ళవచ్చా?" అని అన్నాడు.

"ఊ! తప్పక. ఇది ఇంక నీదే. దీన్లో నీకు నచ్చిన మేక పిల్లని వుంచుకోవచ్చు" అని వాడిని తడుముతూ చిరునవ్వు నవ్వుతూ అన్నాను.

నేను గీసిన బొమ్మ లన్నిటిని తదేక దృష్టితో చూడటానికి మొదలెట్టాడు. ఎంత పెద్దవాళ్ళయినా చిత్రాలని అంత విమర్శనా దృష్టితో చూడగలుగుతారో, లేదో. అంతేకాదు, వాడికున్న పట్టుదల, ఓపిక వాళ్లకి వుంటుందో లేదో...యెలాగయితేనేం, కొంత సేపటికి వాటిలో ఒక దానిని చేతికి పుచ్చుకుని నావంక చూస్తూ "ఈ బొమ్మ నాకు బాగా నచ్చింది. దీన్నే తీసుకుంటాను. ఈ మేక యెంత గడ్డి

తింటుందో నీకు తెలుసా?'' అని ఒక సూటి ప్రశ్నని నాకేసి చప్పున విసిరాడు.

''ఆ ప్రశ్న యెందుకు వచ్చింది?'' అని ఆశ్చర్యంతో అడిగాను.

''ఎందుకా? మా ఇల్లు చాలా చిన్న దని చెప్పానుగా ...'' దిగులు పడుతూ అన్నాడు.

''నువ్వేం దిగులుపడ నక్కరలేదు. ఆ మేక పిల్లకు తగినంత మేత పెట్టెలో వుంచు కోవచ్చు. ....'' అని వాడిని సమాధాన పరుస్తూ అన్నాను.

ఇంతలోకి వాడి దృష్టి మరొకసారి చేతిలోవున్న బొమ్మమీదికి పోయింది. బుర్రలో ఏం తట్టిందో అలా బొమ్మని చూస్తూవున్న కాలంలో మొహాన్ని చిట్లించు కుంటూ ''నువ్వు అనుకున్నట్లు అంత చిన్న మేక అనుకున్నావా?.. ......సరే లే! ...పాపం! పిల్ల అలసిపోయినట్లుంది.... ఇక నిద్రపోతుంది కాబోలు'' అన్నాడు మెల్లగా, బొమ్మని ఆప్యాయంగా తడుముతూ, బుజ్జగిస్తూ.

ఈ సంఘటన మూలానే మా రాజకుమార్‌తో ఆ ఎడారిలో, ఆరోజు ఉదయాన పరిచయభాగ్యం లభించింది.

II

ఇంతకూ ఆ అబ్బాయి ఇటువంటి ఎడారి ప్రదేశానికి ఎక్కడినుంచి రావటం? ఎలావచ్చాడు? ... ఈ సంగతి సందర్భాలని తెలుసుకోటానికి శాయశక్తులా ప్రయత్నించాను. కాని అబ్బాయి నేను అడిగిన ప్రశ్నలకు సూటిగా జవాబిస్తేగా! వాడి దృష్టంతా ప్రక్కన చిందరవందరకై వున్న నా ఏరోప్లేనుమీదే! అసలు ఏరోప్లేను ఎలా వుంటుందో వాడికి కాగితం మీద వ్రాసి చూపెడుతే బాగుంటుందని అనుకున్నాను వాడి వుబలాటాన్నంతా తదేక దృష్టితో చూస్తూ. సరియైన వస్తువులు దగ్గర లేనప్పుడు ఆ ఏరోప్లేనుచిత్రాన్ని ఎలా వ్రాసి ఇయ్యటం? అయితేనేం కొంతవరకు వున్న పరికరాలతోనే ప్రయత్నించాను. కాని ఆ పని సాధ్యమైతే కదూ! ఎంత చిందరవందరగావున్నా, దాని స్వరూపాన్ని ఎటువంటి వాళ్లయినా తెలుసుకోటం అంత బ్రహ్మాండమైనపని కాదు. కాని వాడికి మాత్రం అదేదో తెలుస్తేగా! దాని దగ్గరకు చర చర వెళ్ళాడు. దాన్ని, దీన్ని తట్టి చూశాడు... అలా కొంత సేపు పరీక్షచేస్తూ, నాకేసి సూటిగా అక్కడినుంచే చూస్తూ, ''చూడడానికి బొమ్మగా కనబడుతుందే. ఈ బొమ్మ మిటి?'' అని ఆతృతతో ప్రశ్నించాడు.

''అది బొమ్మకాదు. గాలిలో ఎగిరే వస్తువు. అంచేతనే దాన్ని ఏరోప్లేను అంటారు'' అని యదాలాపంగా అన్నాను.

ఆ జవాబు వినేటప్పటికి అబ్బాయి ఒక

గం తేస్తూ, తిన్నగా నా దగ్గరకే అక్కడి నుంచి వస్తూ "అంటే నువ్వు గాలిలో తిరిగే మనిషివా ? అలాగాలిలో తిరుగుతూ వుండక ఇక్కడికి ఎందుకు వచ్చావు ?" అన్నాడు. ఆ సమయాన వాడి బుర్రలో ఏంఆలోచన తట్టిందో! "ఆ! నువ్వు ఆకాశంలోనుంచి క్రింద పడ్డావా ?" అని ఆదుర్దాతో అడిగాడు.

'ఊ' అన్నాను తలనూపుతూ.

"అలాగా! గాలిలో తిరగటం తమాషాగా వుంటుంది, క్రిందపడటమూ దానికన్నా తమాషాగా వుంటుందికదూ" అంటూ చప్పట్లుకొడుతూ అన్నాడు. అలా అబ్బాయి అనటం, చప్పట్లుకొట్టడమూ చూశాక వెర్రికోపం వేసింది. దురదృష్ట వశాత్తు ప్లేను చెడిపోయింది. అంచేత క్రిందికి రావాలసి వచ్చింది. దానికోసం ఇలా తమాషా చేయటమా! ...

ఆ ఒక్కమాటతో వూరకున్నాడా అబ్బాయి! "అంటే నువ్వు నాకుమల్లె ఆకాశంలోనుంచి వూడి పడ్డావు అన్న మాట. ఇంతకూ ఏ గ్రహమండలాన్నుంచి ఇలా వూడిపడివచ్చావో చెప్పవూ ?" అంటూ గంభీరంగా, ఒకసారి నాకేసి చూస్తూ మరొకసారి ప్లేనుకేసి చూస్తూ ప్రశ్నించాడు.

అబ్బాయి చూడటానికి బేబీకిమల్లె వున్నాడు. అటువంటి పసిపాపకు ఆకాశం సంగతి గ్రహమండలాల సంగతి ఎలా తెలుసో ? ఇదే వాడి ప్రశ్నలని వింటూ వున్నాక నాలో రేకెత్తిపోతూ వున్న ఆందోళన. వాడి వాలకాన్ని చూస్తూవున్నాక, వాడుఅడిగే ప్రశ్నలని వింటూవున్నాక, వాడుకూడా అలాటి గ్రహమండలాల్లో ఒక దాన్లోనుంచి వచ్చాడని అవగాహనం చేసుకోటం అంత కష్టమైన సమస్య కాదు. అంచేత ఆ సంగతి వాడినే సూటిగా అడగ టం మంచిదనుకుని "నువ్వు ఇలాటి గ్రహ మండలాల్లో దేన్లోనుంచో వచ్చావన్న మాట" అని అన్నాను.

ఆ ప్రశ్నకు అబ్బాయి సూటిగా జవా బిస్తేనా! తన దృష్టినంతా ప్లేనుమీదే నుంచుతూ "అవును" అన్నట్లు తలనాడిస్తూ "అంతదూరంనుంచి నువ్వు ఎలా రాగలి గావు ? ...." అంటూ గొణుక్కున్నాడు ఎలా అంత దూరాన్నుంచి ఇక్కడికి రావటం అనేది గడ్డుసమస్యగా! దాన్ని తనంతట తనే తేల్చుకోవాలని కాబోలు కళ్లు మూసుకుని కొంతసేపు ఆలోచనా ప్రపంచంలో మునిగి తేలుతూవున్నాడు...

తరువాత ఏం తట్టిందోఆ చిన్నబుర్రలో, జేబుని తడుముకుంటూ తను దాన్లో దాచి వుంచుకున్న మేక బొమ్మను చేతికి పుచ్చు

కుని దాన్నే కొంతసేపు తదేక దృష్టితో చూడసాగాడు.

మీరంతా నమ్ముతారో లేదో, అబ్బాయి గ్రహమండలాలని గురించి ప్రస్తావించినప్పుడు నాలో చెప్పరానంత ఆందోళన కలిగింది. ఆ విషయాన్ని పూర్తిగా తెలుసుకోవాలని మనసు తహతహలాడుతూవుంది. వాడ్నే తొందరపెట్టి ఆ సంగతి తెలుసుకొంటేగాని మనస్సు కుదట బడదు.

"నువ్వు ఎక్కడినుంచి వచ్చిందీ చెప్పాలి అబ్బాయి! మీ ఇల్లు ఎక్కడ వుంది? మేకను మీ ఇంటికి తీసుకుని వెళ్లాలని అనుకుంటున్నావా లేక" ..... ఇటువంటి ప్రశ్నలని ఒకదానివెంట మరొకటి విసరాను.

వాటినివింటూ బుర్రను తడుముకొన్నాడు ఒక నిమిషం. పెదవిని తెరుస్తూ "నువ్వు ఇచ్చావుకదూ పెట్టెను - దాన్లో నా మేకను రాత్రిళ్లు పరుండబెట్టుకుంటాను. మేకకూ ఎంతో బాగా వుంటుందిగా దాన్లో పడుకోటానికి! ఏమంటావు? "అని మెల్లగా అన్నాడు.

"అలాచేయటం బాగా వుంటుంది. నా దగ్గర మంచి తాడువుంది. దాన్ని నీకు ఇస్తాను. దాంతో మేకని కట్టేసి వుంచవచ్చు. ఏమంటావు?" అని అన్నాను. ఇలా అన్నందుకు వాడు మండిపోయాడు.

"కట్టివేయటమా? అలాటి వూహ నీకెందుకు తట్టింది?" అని అరిచాడు అబ్బాయి.

"కట్టెయ్యకపోతే అదెక్కడికన్నా పారిపోతేనో......" నేను చెప్పేదాన్ని సాంతంగా చెప్పనిస్తేనా. అడ్డం వస్తూ "ఎక్కడికి వెళుతుందని?" అని సూటి ప్రశ్నను విసిరాడు.

"ఎక్కడికైనా వెళ్లవచ్చు ...."
అలా అనేటప్పటికి అబ్బాయి కళ్లు పెద్దవి చేసుకుంటూ "ఎక్కడికి పోతుందని అంత కంగారు పడాలి. ఎప్పుడూ అది నా దగ్గరే వుంటుందికదూ? అది చిన్నది. నా కన్ను దానిమీదే వుంటుందికూడా" అని కంగారుపడుతూ అన్నాడు.

"ఎవళ్లకు తెలుసు! నువ్వు నిపనిలో మునిగి పోయివున్నప్పుడు నీ కళ్లల్లో ఇసుక పోసి పరిగెత్తిపోతేనో..." అనబోయాను.

(తరువాత వీళ్లిద్దరి మధ్యగల అవినాభావ సంబంధం ఏరూపం దాలుస్తుందో వచ్చేసంచికలో తెలుసుకుంటారుగా!)

——(o)——

# విశ్వసుందరి

శ్రీ K. V. సుబ్బారావు బి. ఏ.



(గత సంచిక తరువాయి)

గంధర్వకన్య పద్మం దిగి ఒడ్డుకువచ్చి మాణిక్య హారాన్ని యువకుని మెడలో వేసింది. "సాహస వంతుడవంటే నీవేనయ్యా. నీ అద్భుత సాహసానికి యిదేనా జోహార్! ఫో. గడువులోపల చేరి నీ యీ కానుక చెల్లించు. ఈ మాణిక్యహారం మెడలో ఉన్నంతకాలం వ్యాధులు వెన్నంటవు. దీన్ని ధరించినవారు నిత్యయవ్వనవంతులుగా వుంటారు. ఇదే యీ హారంలోవున్న ప్రత్యేకత" అంది.

"సెలవు" అని అంటుండగా చెలికత్తెవచ్చి, "మరి ఆ కానుకతోనే తృప్తిపొందుతున్నారు. వెలలేని యీ గంధర్వ కన్యను ఎప్పుడు పరిణయమాడుతారు" అంది. గంధర్వకన్య సిగ్గుతో తలవంచుకుంది. చెలికత్తె సాక్షిగా గాంధర్వవిధిన వివాహం జరిగిపోయింది.

"ఇదిగోండి. యీ వజ్రాల వుంగరం. దీనిని నేలమీద రాసినప్పుడు నేను ప్రత్యక్షమౌతాను" అని వుంగరాన్ని భువనసుందర్ వ్రేలికి తొడిగింది.

భువనసుందర్ గంధర్వకన్యవద్ద సెలవుతీసుకొని తృటిలో నీలవేణి నగరానికి వచ్చాడు. రాజప్రాసాదంలో అడుగుపెట్టి, "యిదిగో మీరు కోరిన మాణిక్యహారం" అంటూ ఆమె మీదికి విసిరాడు. కాని ఆ మాణిక్యహారం ఆమెమీదపడలేదు. సరాసరివచ్చి విశ్వసుందరి మెడలో వ్రాలింది. ఈ అవమానానికి మణికర్ణికకు మిగుల కోపంవచ్చింది. విశ్వసుందరి మెడలోనించి తీయబోయింది కాని హారం రాలేదు పైపెచ్చు రాణి చేతులు పుండ్లుపడినయ్.

"నేనెప్పుడు పతివ్రతుల కంఠాన వుంటను. సత్సంపన్నుల కంఠమే నాకు నిలయం" అని చెప్పింది మాణిక్యహారం.

రాణి చేసేదిలేక నోరు మూసుకుని కూర్చుంది.

"సరే నా రెండవ ప్రశ్న విను. ఈ వస్తువును ఐదురోజుల్లోనే సాధించాలి. ఇక్కడికి ఈశాన్య దిశలో నీలపుకొండల నడుమ పెద్ద పుట్టవుంది. ఆ పుట్టలో నాగమాత సిరస్సున ధరించిన నాగమణిని సాధించుకురావాలి" అంది. "ఈసారి తప్పకుండా భువనసుందర్‌ను నాగుపాములు చంపేస్తాయని ఆమె గాఢ నమ్మకం. దానితో తన పీడ వదులుతుంది, అనుకొన్నట్లు తమ్ముడికి అంటగట్టవచ్చును" అని కుతూహలపడసాగింది రాణి.

కాని భువనసుందర్ అంత తేలికమనిషి కాడు. కార్యాన్ని సాధించి తీరుతాడని ఇంకా ఆమెకు తెలీదు. వెంటనే భువనసుందర్ రాణివద్ద సెలవు తీసుకొని రాజప్రాసాదం బయటకు వచ్చేశాడు.

8

రాజభవనాన్నుండి సరాసరి ఈశాన్య దిక్కుకే ప్రయాణం సాగించాడు. పదిహేను మైళ్ళపైబడి వెళ్ళినతర్వాత నీలపు కొండలు కనిపించినయ్. అయితే నీలపు కొండలను ఎక్కడం ఇతర కొండల నెక్కినంతసాధ్యంకాదు. మూడు మెట్లు ఎక్కితే నాలుగుమెట్లు వెనక్కు నెట్టేస్తుంది. అయినా భువనసుందర్ సాహసించాడు. నెమ్మదిగా కొండలనెక్కి ఎలాగయితేనేం కొండలనడుమ ప్రదేశానికి వచ్చేశాడు.

మణికర్ణిక చెప్పినట్లు కొండలనడుమ ఒక పెద్ద పుట్టవుంది. ఆ పుట్టకు ఒకటే ఒకకలుగు. కలుగును తేరి పార జూశాడు. కలుగులోనుండి లోపలకు మట్టిమెట్లు అగుపించినయ్. నెమ్మదిగా సద్దుచేయకుండా మెట్టగుండా లోపలకు వెళ్లాడు. కాని అలా వెళ్లి వెళ్లి చివర మెట్టుదగ్గరకు వచ్చాడు. కాని ఆ మెట్టుజారింది. భువనసుందర్ సరాసరి పోయి పోయి ఒక నాగుపాము నోట్లోపడ్డాడు. ఎప్పుడయితే నోట పడ్డాడో ఆ క్షణంలోనే నాగుపాము గుటుక్కుమనిపించింది భువనసుందర్‌ను.

భువనసుందర్ కాస్తా నాగుపాము నోట్లోవుండిపోయాడు. ఐతే భువనసుందర్ ఎలా నాగుపాము నోట్లోనుంచి తప్పించుకోవాలా అని ఎత్తులువేస్తూనే వున్నాడు. చివరికో వుపాయంతట్టింది. వెంటనే మొలలోంచి కత్తితీసి నాగుపాము కడుపుచీల్చటం మొదలెట్టాడు. నాగుపాము కత్తిపోటులకు తాళలేక భువనసుందర్‌ను కాస్తా బయటకు కక్కేసింది. ఈ వుపాయంతో భువనసుందర్ బుడుంగుమని బయటకొచ్చేశాడు,

"నీవు ఏమి పనిమీదవచ్చావ్?" అని అడిగింది నాగుపాము.

"నాగమణికోసం వచ్చాను. అదెక్కడుందో చెప్పు?" అంటూ గద్దించాడు.

"పిచ్చివాడా! నన్ను భయపెట్టినంత సులభంగా నాగమణిని సంపాదించలేవోయ్. అయినా నాగమణి నావద్దలేదు. దానిని సంపాదించవలెననుకుంటే నీవు లోకోత్తరమయిన ఘనసాహసంచేయాలి." అంది.

"అయితే ఆ సాహసమేమిటో చెప్పు. ఏకష్టానికయినా వెనుకదీయను; కార్యాన్ని సాధిస్తానూ!" అన్నాడు.

"సరే పద. నిన్ను నాగమాత దగ్గరకు తీసుకెళ్లుతాను. అక్కడకాని నీరంగు తేలదు." అని భువనసుందర్‌ను నాగమాత దగ్గరకు తీసుకెళ్ళింది.

నాగమాత యితన్నిచూచి "ఎవరునువ్వు?" అని గర్జించింది.

భువనసుందర్ వినమ్రుడయి ఆమెకు నమస్కరించి తన పేరు చెప్పుకుని, తాను వచ్చిన యావద్వృత్తాంతం చెప్పాడు.

"నాగమణిని సంపాదించవలెనని వచ్చిననీబోటి యువకులనేకమందిని చూశాను. కాని ఆ యువకులంతా నా పరీక్షకు తాళలేక బుగ్గి అయిపోయారు. సాహసంలేకండా ముందడుగు వేశావా నీగతీ అంతే." అంది నాగమాత.

"సాహసించే వచ్చాను నేను. ఆ సాహసమేమిటో చెప్పండి. ప్రాణాలకయినా వెనుతీయక సాధించితీరుతాను" అన్నాడు.

"భేష్ నీ ధైర్యమే చెపుతుంది, నీవు అపజయానికి శత్రుడవని. ఇక్కడకు పడమరగా ముత్యాల సముద్రంవుంది. ఆ సముద్రంలో ఒక వింతచేపవుంది. ఆ చేపపేరు 'నల్లచేప' నీవు సముద్ర గర్భంలోకి పోయి 'నల్లచేప'ను బయటకు తీసుకురావాలి. అలా ఆ చేపను బయటకీడ్చుకొచ్చావా నీకు నాగమణి దక్కుతుంది. లేక ఒట్టిచేతులతో వచ్చావా నీ శిరస్సు నాకు దక్కుతుంది. 'నల్లచేప' నాకు బద్ధశత్రువు. దాన్ని పట్టియ్యాలి. పో!" అంది నాగమాత.

"సరే యీ సాయంత్రానికల్లా మీకు 'నల్లచేప'ను పట్టించి తీరుతాను" అని సరాసరి పడమరగా బయలుదేరి సముద్రపు ఒడ్డుకు వచ్చాడు. నిజంగా అది ముమ్మూర్తులా ముత్యాల సముద్రమే. ముత్యాలన్ని అలలమీద తేలియాడుతున్నయ్. ఎక్కడ చూసినా ముత్యాలమయం. సముద్రంలో చేపపిల్లలన్ని ముత్యాలగొళ్లు కట్టుకొని ఆడుకుంటున్నయ్. ఆ వింతలనుచూస్తూ కాలాన్ని విషయాన్ని మరచిపోయాడు. కాని కాస్సేపటికల్లా అసలు విషయం గుర్తుకు వచ్చింది. సముద్రంలోకి ఎలా వెళ్లటమో అర్థంకాలేదతనికి. ఇంతలో అతనిచేతి వుంగరం ఒక

రాయికి తగిలింది. వెనువెంటనే గంధర్వకన్య ప్రత్యక్షమైంది.

"ఏం కావాలీ నీకూ?" అని అడిగింపినవ్వుతూ భువనసుందర్ అసలు విషయం చెప్పాడు.

"ఓస్ ఇంతేకదా. మరేంకంగారుపడకు," అని ఒకశ్యామగుళికను అతనికిచ్చి దీన్ని నోట్లో వేసుకొని సముద్రంలో మునుగు. 'నల్లచేప'ను బయటకు లాగటానికి యిది వుపాయం. ఎందుకంటే యీ శ్యామగుళికను నోట్లోవేసుకుని నీటిలోదిగిన మరుక్షణం చేపగా మారిపోతావు. బయటకురాగానే యీగుళికను సముద్రంలోపారేయ్. బయటకొచ్చిం తర్వాత క్షణం నీ దగ్గరవుంచుకున్నావా కీడుమూడుతుంది" అని చెప్పి మాయమైంది.

గంధర్వకన్య ఇచ్చిన శ్యామగుళికను నోట్లోవేసుకొని సముద్రజలంలో మునిగాడు. తక్షణమందే చేపగా మారిపోయాడు. ఎక్కడలేనిబలం తెచ్చుకొని 'నల్లచేప'నుపట్టి ఒడ్డుకు యీడ్చుకువచ్చి దాన్ని మండే ఇసుకలో వేశాడు. బయటకొచ్చి గుళికను తీయగానే మామూలు మనిషి అయ్యాడు. గంధర్వకన్య చెప్పినట్లు ఆ గుళికను సముద్రంలో పారవేశాడు. కాని తక్షణంలోనే సముద్రమంతా ఫెళఫెళామని వుడికిపోయింది. ఆవిరిగా మారిపోయింది నీరంతానూ. నీరంతా మాయమై సముద్రం నిండా ముత్యాలు మిగిలినయ్. ఆ వింతను చూస్తూ అలానే నిలుబడిపోయాడు భువనసుందర్.

ఇంతలో భువనసుందర్ వెనక్కు తిరిగి చూడగానే నాగమాత నవ్వుతూ కనిపించింది. "ఇంత ధైర్యవంతుడివి! నిన్ను ఒక్కడినే చూశానోయ్" అని నవ్వింది. వెంటనే నాగమాత చేపకడుపును జాగ్రత్తగా బదలు చేసింది. ఆశ్చర్యం! ఆ చేపకడుపులో నుంచి పదహారేళ్ళ బాలిక నవ్వుకుంటూ బయటకొచ్చి నాగమాతను కౌగలించుకుంది. నాగమాత ఆమెను ముద్దుపెట్టుకొని ఎదకు హత్తుకుంది.

నాగమాత భువనసుందర్ వయిపు తిరిగి యిలా అంది:

"ఇదంతా నీకు వింతగావుందికదూ నాయనా. ఈ బాలిక నా కూతురు. దీనిపేరు నాగసుందరి. ఇది ఒకసారి సముద్ర తీరంలో ఆడుకుంటుంటే దీన్ని 'నల్లచేప' మ్రింగి సముద్ర గర్భంలోకి పారిపోయింది. నా బిడ్డను వెలికి తెచ్చుకుందామని ఎంత ప్రయత్నించినా నాకు చేతకాకపోయింది. సామాన్య మానవుడవు. నీవు నా బిడ్డను కాపాడగలిగావ్. పైగా నీళ్లను ఆవిరిచేసి సముద్రమంతా రత్నాలమయం చేయగలిగావ్. నీ బోటి అద్భుత యువకునకు నా కూతుర్నిచ్చి వివాహంచేయటంకంటే నాకు కావలసిందేముంది? ఈ రాత్రి మీ యిద్దరికి పెండ్లిచేసి రత్నరాసుల నివ్వటమే కాకుండా నీవు కోరిన నాగమణినికూడా ఇస్తాను" అంది.

భువనసుందర్ సంతోషానికి అంతులేదు. ఆ రాత్రి వైభవంగా నాగసుందరి భువనసుందర్‌ల కల్యాణం జరిగింది. భువనసుందర్ తనకు కలిగిన అదృష్టానికి పొంగిపోతాడు.

పెండ్లి అయింది. ఒక రోజు భార్యతో కులాసాగా గడిపాడు. "ఇక వస్తాను" అని అంటుంటే నాగసుందరి కంట నీరు పెట్టింది.

"రాణి మూడవ వస్తువుకూడా సాధించి నిన్ను తీసుకువెడతాను సరేనా" అని జవాబిచ్చాడు భార్యకు.

ఇంతలో నాగమాతవచ్చి "నాగమణి"ని అతని చేతుల్లో పెట్టింది. ధగధగా వెలిగిపోతూంది ఆ మణి

"భువనసుందర్! యీ మణి సామాన్యమైనదిగా తలచకు. ఇది అత్యద్భుతమైంది. ఇది ఎక్కడయితే వుంటుందో అక్కడ ఎప్పుడూ పగలే. చీకటి అనేదే వుండదు. ఇక మా రాజమహాలులో వుండతగిన శుభమణి. పైగా యీ మణి రోజుకు ఎనిమిదివేల వీశెల బంగారం కురిపిస్తుంది సుమా!

అవిగో నీ కోసం రత్నాలు నింపిన బండ్లు ఎదురు చూస్తున్నయ్" అంది నాగమాత.

"గుర్తుగ నేను మూడు రత్నాలు తీసుకెళతాను. మీ కూతురు యీ సారి వచ్చేటప్పుడు రత్నాల బండ్లను పంపండి. ఇప్పుడు తొందరగా వెళ్ళాలి. అవతల కాలం మించిపోతోంది" అన్నాడు.

"సరే నీ యిష్టం. నీవు అమ్మాయిని తలుచుకున్నపుడు ప్రత్యక్షమౌతుంది" అని చెప్పింది. నాగమాతవద్ద, క్రొత్త భార్యవద్ద, సెలవు తీసుకొని క్షణంలో రాజప్రాసాదం చేరుకున్నాడు.

మరు క్షణంలో సభలోకివచ్చి నాగమణిని మణికర్ణికచేతి కందించాడు. కాని యీ సారికూడా నాగమణి మణికర్ణిక చేతిలో వుండలేదు. రాణి చేతులో నుంచి ఎగురుకుంటూవచ్చి నీలరదనుని దోసిలి నలంకరించింది. అతడు తెచ్చిన ముత్యాలనుచూచి ఎంతో మురిసిపోయింది విశ్వసుందరి.

ఈ సారి తను వేసుకున్న పథకం తల్లక్రిందులయింది. పైగా నాగమణికూడా తనకు దక్కకుండా పోయిందే అనుకొని మనసులోనే క్రుళ్ళి క్రుళ్ళి ఏడ్చింది. ఆ అసూయను కడుపులోనే దిగమ్రింగుకొంది.

"ఇదే ఆఖరుకోరిక. దీనితో ఆశ నిరాశ అవుతుంది. ఈ సారి సాధించటానికి వీలులేనిపని చెప్పాలి. దానితో ఏరాక్షసి నోట్లోనో గుటుక్కుమంటాడు. అంతటితో నా కోర్కె ఫలిస్తుంది విశ్వసుందరి నా తమ్ముడి పెండ్లాంఅవుతుంది" అని దీర్ఘంగా యోచించింది.

"నీవీ రెండు వస్తువుల్నీ ఘనంగా సాధించి విజయుడవైనందుకు నా అభినందనాలు. ఐతే నా చివరిప్రశ్న విను. ఇక్కడికి నూటిగాపోతే రాబందుల గుంపొకటి కనిపిస్తుంది. రాబందుల రాజును రత్నాంగుళీయం సాధించటానికి మార్గమేది అని అడిగితే చెపుతుంది. పో! యీ మూడవ వస్తువును సాధించి తెచ్చావో విశ్వసుందరి నీ భార్య అవుతుంది. సాధించలేకపోయావో ఆమె నీ పాలిటి మృత్యుదేవత అవుతుంది. జాగ్రత్తగా యోచించుకొని ముందడుగు వేయటం మంచిది" అని ఓ విషపు నవ్వు పారేసింది.

అయినా భువనసుందర్ ఆ విషజడుపులకు భయపడలేదు. నిర్భయంగా నేవున్నాడు.

"సరే కాలయాపన ఎందుకూ మీ చివరి రత్నాంగుళీయం సాధిస్తాను. సెలవిప్పించండి" అని బయలుదేరాడు నిర్భయంగా భువనసుందర్.

(సశేషము)

# న్యాయమైన తీర్పు

శ్రీ పి. ప్రభుదాస్

మన దేశముపై దండెత్తివచ్చిన సార్వభౌములలో సికందరు మిక్కిలి ప్రజ్ఞాశాలి, వీరుడు. అనేక దేశములు జయించినాడు. ఒకసారి మన దేశముపై దండెత్తివచ్చి పంజాబులో కొంత భాగము ఆక్రమించినాడు.

ఒకరోజు తిరుగుతూవస్తూ పంజాబులో ఒక గ్రామానికి వచ్చాడు. అక్కడ ఒక రైతు గుడిసె ఉంది. ఆ రైతు ఆ గ్రామానికి అధిపతి. గ్రామాధికారి సికందరును చాలా గౌరవించి ఉన్నతాసన మిచ్చాడు. తదుపరి ఒక వెండిపళ్ళెంలో కొన్ని తినుబండారాలు, మరొక ప్రక్క కొన్ని బంగారు కణికలు వుంచుకొని చక్రవర్తికి సమర్పించాడు. తినుబండారాలతో బంగారు ముక్కలను చూచి నవ్వుకొన్నాడు. ఆ రైతును పిలచి అడిగాడు "మీరు భోజనానంతరం కొంత బంగారాన్ని కూడా స్వీకరిస్తూ ఉంటారా ?"

ఆ మాటకు రైతు జవాబిచ్చాడు "లేదు మహారాజా ఇక్కడివాళ్లు అట్లా చేయరు. కానీ మీరు యీ వెండి బంగారాలకోసమే మీ ఇల్లూ వాకిళ్ళూ వదలి ఇంతదూరం వచ్చారని విన్నాను. అందుకనే యీ కానుకలు తమకు సమర్పించుకుంటున్నాను. తమరు దయయుంచి వీటిని స్వీకరించండి."

సికందరు జవాబిచ్చాడు. "లేదు, లేదు. ధనధాన్యాదుల లాలసతో నేను హిందూదేశంరాలేదు మీ దేశవాసుల కట్టుబాట్లు, అలవాట్లు, నీతి, నిజాయితీల చూడ్డానికి వచ్చా"నన్నాడు.

ఇంతలో ఇద్దరు గ్రామస్థులు తమలో తాము కలహించుకుంటూ తీర్పుకోసం గ్రామాధికారి కడకు వచ్చారు.

అందులో ఒకడన్నాడు "అయ్యా, నేను ఇతనియొద్ద ఒక పొలమును కొని ఉన్నాను. ఆ పొలంలో నాకు వెండి బంగారాలతో నిండిన బిందె దొరికింది, అది నాకు సంబంధించినది కాదు. ఎందుకంటే నేను కొనేటప్పుడు పొలాన్ని మాత్రమే కొనుక్కున్నాను. పొలంలో దొరకబోయే వస్తువుని కొనలేదు. అందుకని నేను అతని బిందె అతనికిచ్చివేస్తానంటే అతను పుచ్చుకోడం లేదు. దయయుంచి మీరు అతన్ని వప్పించాలని ప్రార్థిస్తున్నాను."

ఇది విని గ్రామాధికారి రెండవ అతన్ని అడిగాడు.

"ఇక నీవేమి చెబుతావు?"

రెండవవాడన్నాడు "అయ్యా, నేను అతనికి పొలమును అమ్మినప్పుడు పొలంలో గడ్డి మొలవనీ, నిధినిక్షేపాలు దొరకనీ అతనికే చెందుతాయి. అతని అదృష్టంకొద్దీ అతనికి ఆ భాగ్యం దొరికింది. నేను ఆ బిందెను ఏమాత్రమూ పుచ్చుకోను."

ఇద్దరి ఫిర్యాదువిని సికందరు ఆశ్చర్య చకితుడైనాడు. 'తీర్పు ఎట్లా చెబుతాడా' అని సికందరు గ్రామాధికారివంక కన్నెత్తకుండా చూస్తూ కూర్చున్నాడు.

కొంతసేపు ఆలోచించి గ్రామాధికారి మొదటివాన్ని పిలిచి అన్నాడు. "నీ ఇంట్లో వ్యక్తురాలై పెండ్లీడుకొచ్చిన ఒక అమ్మాయి ఉందికదూ?"

"చిత్తం నా కూతురు ఉంది."

వెంటనే అధికారి రెండవవాణ్ని అడిగాడు "నీ ఇంట్లో ఒక యువకుడున్నాడు కదూ?"

"చిత్తం"

"వయస్సు?"

"పాతిక సంవత్సరాలు"

అధికారి మొదటి గ్రామస్థుని పిలచి అన్నాడు "మీ అమ్మాయిని అతని అబ్బాయికిచ్చి వివాహం చెయ్యి. ఆ బిందె కట్నంక్రింద వాళ్ళిద్దరకూ ఇచ్చివేయి. నీ అల్లుడూ నీ కూతురూ సుఖంగా ఉంటారు. మీ ఇద్దరి సమస్య తీరిపోతుంది. ఇద్దరూ బంధువులే అవుతారు. ఇక మీకు ఏ చిక్కూ లేదు."

ఈ తీర్పువిని గ్రామస్థులిద్దరూ ఎంతో సంతోషపడ్డారు. వందనాలర్పిస్తూ ఇండ్లకు చేరుకున్నారు.

ఈ పంచాయితీచూచి సికందరు ఆనంద పరవశుడైనాడు. గ్రామాధికారితో అన్నాడు "సోదరా! నేను ఇది చూడడానికే ఇంతదూరం వచ్చాను. హిందూదేశ ప్రజలు - ఉదార స్వభావులని, నిజాయితీపరులని, లోభత్వానికి లోనుకారని విని యున్నాను. ఇప్పుడు నా కళ్ళఎదుటే ఆ సత్యాన్ని గ్రహించాను" అని చెప్పి సికందరు అక్కడనుండి వెళ్ళిపోయాడు.



# అల్లుడు

శ్రీమతి దాసరి శారద, బి. ఏ.

"అల్లుడు గదా యని నెత్తి నెక్కించుకుంటే మమ్మల్ని యిలా వేధించుతున్నాడేమిటండీ?" అన్నది జానకమ్మ సరస్వతమ్మతో.

"ఎవరి సంగతండీ! మీ అల్లుడుగారేనా?" అన్నది సరస్వతమ్మ సంగతి తెలుసుకోవాలనే కుతూహలంతో.

"మా అల్లుడుగాక యింకెవరండీ! ఆయనే 'జామాతా దశమో గ్రహః' అన్నట్లు తయారయాడంటే నమ్మండి." అన్నది జానకమ్మ అల్లుడుగారి ఆటల్ని భరించలేక బయటపెడ్తూ.

"అసలు ఏమి జరిగిందో చెప్పండి." అన్నది సరస్వతమ్మ కథా ప్రారంభాన్ని తెలుసుకోవాలనే ఉత్సాహంతో.

"మొన్న సైకిలు కొనిపెట్టాము—యీ వేళ వాచీ కావాలంటున్నాడండీ—వాచీ" అన్నది జానకమ్మ పళ్లు పటపట కొరుకుతూ.

"అలా తిప్పలు పెట్టే ఎలాగండీ. ఎలాగో సర్దుకోవాలి గాని." అన్నది సరస్వతమ్మ.

"మీకేం తెలుసండీ! రోజూ మేము పడుతున్న తిప్పలు ఆ భగవంతుడికి తెలుసు. అనుభవిస్తున్న మాకు తెలుసు." అన్నది జానకమ్మ కళ్ళ నీళ్ళు పెట్టుకుంటూ.

♦ ♦ ♦

రాఘవయ్యగారు మధ్యతరగతి కుటుంబీకుడు. ఆ సంపాదించేదేదో పొట్టకూ బట్టకూ సరిపోతుంది. పిల్లా జల్లా ఎక్కువగా లేరు — ఒక సరోజ తప్ప. ఆ పిల్ల గూడ రాఘవయ్యగారూ జానకమ్మా ఎన్నో నోములు నోచిన తరువాత పుట్టింది. అందుచేత కంటికి రెప్పలా కాపాడి పెంచారు ఆ దంపతులు. సరోజ అని పేరు పెట్టి ముద్దుగా పిలుచుకొనేవారు.

రాఘవయ్యగారు కొంచెము పూర్వాచార పరాయణుడనే చెప్పాలి. అందుచేత సరోజకి ఆరవ క్లాసుతోనే చదువు మాన్పించారు. ఈడు వచ్చిన పిల్లకి పెండ్లి చేయకుండా వుండకూడదని జానకమ్మ తొందర పెట్టింది.

రాఘవయ్యగారు అల్లుడ్ని వెదకటానికి కాలికి బలపము కట్టుకొని తిరిగారు. ఎక్కడబట్టినా పది వేలూ — ఐదు వేలూ కట్నాలడుగుతున్నారు. పాపం రాఘవయ్యగారు చమటోడ్చి సంపాదించిందంతా కలిపినా రెండు వేలు దాటవు. అలాంటప్పుడు అల్లుడ్నెలా కొనగలడు?

చివరకు చీరాలలో ఒక సంబంధము కుదిరింది. అదీ ఒక పాత స్నేహితుడు తటస్థపడటము చేత కుదిరింది. చీరాలలో రాఘవయ్యగారి బాల్యమిత్రుడు చంద్రయ్య వ్యవసాయము చేసుకొని బ్రతుకుతున్నాడు. ఆయనకు సంతానం ఐదుగురు. ముగ్గురాడపిల్లలు — యిద్దరు మగపిల్లలు. పెద్దకొడుకు శేషగిరిరావు స్కూలు ఫైనలు వరకు చదివి పనీ పాటా లేకుండా తిరుగుతున్నాడు. ఏదన్నా పనిలో చేరమని చంద్రయ్య రాత్రింబగళ్ళు బ్రతిమిలాడి చెప్పాడు. కాని శేషగిరిరావుకదేమీ తలకెక్కలా. ఎంతో ఆలోచించిన మీదట చంద్రయ్య ఒక నిశ్చయానికి వచ్చాడు. అదేమిటంటే శేషగిరిరావుకి పెండ్లి చేస్తేనన్నా పెళ్ళాన్ని పోషించడానికయినా పనికి పోతాడని. కాని పెళ్ళంత త్వరగా అయేపనా? ఆడపిల్లనిచ్చే వాళ్ళు ఎన్నివిధాల ఆలోచిస్తారు? పనీ పాటా లేకుండా బికారీ ఫకీరులా రోడ్లు వెంట తిరిగే శేషగిరిరావుకి చంద్రయ్య అనుకున్నంత

త్వరగా పెళ్ళి కుదరలేదు. ఆ విధంగా రెండేళ్ళు గడిచినయ్. చివరికి రాఘవయ్యగారు ఆటస్థపడ్డారు. ఆయన తన కష్టాలు చెప్పుకొని కట్నాల ధరలు పెరగటంవల్ల తమ సరోజకి పెళ్ళికావటములేదని విలపించారు. చంద్రయ్య అంతావిని మూడువేల రూపాయిల్లోనయితే తన కొడుక్కి చేసుకుంటానన్నాడు. రాఘవయ్యగారు సంతోషంతో 'అలాగే'నన్నారు.

ఎలాగయితేనేం రాఘవయ్యగారు తాముకూడ బెట్టిన డబ్బుకి జానకమ్మగారి నగలు అమ్మగావచ్చిన డబ్బుకలిపి మూడువేలూ ముట్టజెప్పి మూడుముళ్ళూ వేయించి సరోజ పెళ్ళి అయిందనిపించారు.

♦ ♦ ♦

పెళ్ళి జరిగి ఏణ్ణర్ధం అయింది. ఈ మధ్య ఎన్నో మార్పులు వచ్చినయ్. శేషగిరిరావుకి పాతికేళ్ళు నిండినా పనిమాట పట్టించుకోవటములేదు. చంద్రయ్య నయానా చెపిఎచూచాడు భయానా చెప్పిచూచాడు కానీ ఏమాత్రమూ ప్రయోజనములేకపోయింది. శేషగిరిరావు చిన్నతనంలోనే కొటుకుతంగా వుండేవాడు. ఇహ యిప్పుడు తండ్రిమాటవింటాడా? మొక్కైవంగనిది మ్రానైవంగుతుందా? చంద్రయ్యకి విసుగుపుట్టింది. "అడ్డాలలోనే బిడ్డలుగాని గడ్డాలు వచ్చాక బిడ్డడా? "అని అనుకున్నారు.

♦ ♦ ♦

రాఘవయ్యగారు సరోజని తీసికొని వెళ్ళమని వియ్యంకుడికి ఉత్తరము వ్రాశారు. చంద్రయ్య "కొడుక్కే పెట్టలేక అవస్థపడుతుంటే యింకాపైగా కోడలికి ఎక్కడ్నుంచి తెచ్చి పెట్టేది" అనుకున్నాడు. చంద్రయ్య బాగా ఆలోచించి రాఘవయ్యగారికి కబురుచేశారు. ఏమనంటే — "మీ అల్లుడికి మీరే ఏదైనా ఉద్యోగము చూపించుకోండి లేకపోతే అమ్మాయిని యిక్కడికి తీసుకురావడానికి వీలుపడదు." అని.

ఉత్తరము చదువుకొని రాఘవయ్యగారు నిర్ఘాంతపోయారు. మూడువేలూ పోసికొన్నదిగాక యింకా అల్లుడికి ఉద్యోగము ఎక్కడ చూపించగలడు? అందులో యీ 'సిఫారసు'ల యుగంలో పని దొరకటం మాటలా?

రాఘవయ్యగారు జానకమ్మను పిలచి వియ్యంకుడు వ్రాసిన ఉత్తరము చదివి వినిపించారు. జానకమ్మ విని ముక్కుమీద వేలు వేసుకున్నది. "ఏమైనాసరే అనుభవించక తప్పుతుందా?" అనుకొని భర్తతో "సరే ఏమిచేస్తాము? అల్లుడుగార్ని పిలిపించండి. అమ్మాయిని వాళ్ళు తీసుకువెళ్ళనప్పుడు మరి మనమే అబ్బాయిని తెచ్చుకుందాము. మీరే ఏదో ఒక పని చూపించండి. తప్పుతుందామరి" అన్నది జానకమ్మ.

"నేనూ అదే అనుకుంటున్నాను. మనము వాళ్ళకన్నా తగ్గివుండాల్సిందే మరి. ఇచ్చినవాడు ఈగ - పుచ్చుకున్నవాడు పులి" అన్నారు రాఘవయ్యగారు.

మరునాడు రాఘవయ్యగారు వియ్యంకుడికి శేషగిరిరావుని పంపవలసినదని ఉత్తరము వ్రాశారు.

ఉత్తర మందిన మూడో రోజు శేషగిరిరావు అత్తగారింట్లో హాజరయినాడు. అల్లుడికి జరుగవలసిన మర్యాదలన్నీ యథా ప్రకారంగా జరిగిపోయినయ్.

పదిహేను రోజులు గడచిపోయినయ్. రాఘవయ్యగారు సరోజపెళ్ళి కుదర్చటానికి ఎంత కష్టపడ్డారో అంతకు రెట్టింపుగా శేషగిరిరావు ఉద్యోగముకోసము కష్టపడ్డారు. చివరకు 'డిస్ట్రిక్టు బోర్డు'లో గుమాస్తాపని ఖాళీగా వుందని తెలిసింది. శేషగిరిరావుని పిలిపిస్తే 'ఇంటర్వ్యూ' చేసి పనియిస్తామన్నారు. రాఘవయ్యగారు చాల సంతోషించారు. కూతురూ - అల్లుడూ తమ కళ్ళ ఎదుట వుంటారని సంతోషించారు.

ఇంటికి తిరిగివచ్చి శేషగిరిరావుకి ఉద్యోగము దొరికిందని చెప్పారు. శేషగిరిరావు "ఆ! గుమాస్తాపని ఎవరుచేస్తారు" అని తిరస్కరించాడు.

రాఘవయ్యగారు ఏమీ చేయలేక ఊరుకున్నారు కొన్నిరోజులు గడచిపోయినయ్.

ఒక రోజు శేషగిరిరావు 'సినిమా' నుండి వచ్చి 'సరో ! సరో' అని భార్యను పిలిచాడు.

"ఏమిటండీ !" అన్నది సరోజ.

"మరేమీలేదుగాని నేనొకటి అడుగుతాను. మరి మీనాన్నకి చెప్పి ఒప్పిస్తావా ?" అన్నాడు శేషగిరిరావు.

"ఏదో ప్లాను వేశారే ! సరే ఏమిటో చెప్పండి" అన్నది సరోజ.

"ఆ ! ఏమీలేదు. ఒక రేడియో కొనమని చెప్పు. యిద్దరికీ కాలక్షేపంగా వుంటుంది." అన్నాడు శేషగిరిరావు.

"రేడియోకే పెట్టారూ - బాబోయ్! రేడియో కొనటమంటే మాటలా ?" అన్నది సరోజ.

"ఏం ? రేడియో అంటే వేలు చేస్తుందనుకున్నావా" అన్నాడు శేషగిరిరావు.

"అల్లుడంటే వేలు చేసినా కొంటారుగాని రేడియోగూడ వేలుచేస్తే ఎవరుకొంటారులెండి !" అన్నది సరోజ వ్యంగ్యంగా.

"ఆ ! మాటలు నేర్చావే ? నన్నేగా నీవు ఎత్తి పొడుస్తున్నది." అన్నాడు శేషగిరి కొంచెం కోపంగా.

"ఎందుకండీ ! గుమ్మడికాయ దొంగెవరంటే భుజాలు తడుముకుంటారు." అన్నది సరోజ నవ్వుతూ.

"ఇంతకీ నేనడిగింది మీనాన్నకి చెప్తావంటావా? లేదా ?" అన్నాడు శేషగిరిరావు బెదరిస్తూ.

"అలాగేనండీ! 'ఆ కిష్కింధ సామ్రాజ్యానికి సుగ్రీవునాజ్ఞ' ఈ గృహసామ్రాజ్యానికి మీయాజ్ఞ." అన్నది సరోజ లోపలికి వెళ్తూ.

మర్నాడు సరోజ తండ్రితో రేడియోవిషయము చెప్పింది. రాఘవయ్యగారు యింతవరకూ పేపరు గూడ లైబ్రరిలోనే చదువుకునేవారుగాని డబ్బుపెట్టి కొనుక్కునేవారు కారు. కాని అల్లుడువచ్చిన దగ్గఱనుండి పేపరు కొంటున్నారు. కాని అల్లుడు రేడియో కొనమని కూర్చున్నాడు. సరే అల్లుడి కోరిక తీర్చవద్దా అనుకొని మూడువందలు పెట్టి రేడియో కొన్నారు - రాఘవయ్యగారు.

రేడియో కొన్నదగ్గఱనుండి శేషగిరిరావు ఒకటే పెట్టటం. రేడియోవారు కొన్నిగంటలు విశ్రాంతి యిచ్చారుగాని లేకపోతే శేషగిరిరావు రోజంతా పెట్టేవాడే. ఈ విశ్రాంతి సమయంలో శేషగిరిరావు సినిమా పత్రికలు చదువుతూవుండేవాడు. మళ్ళీ కాఫీ - అదీ త్రాగి కాస్త అటూ — యిటూ తిరిగేటప్పటికి సినిమాటయిమయేది. ఈ విధంగానే శేషగిరిరావుకి కాలముగడచిపోతుంది.

సాయంకాలం రాఘవయ్యగారు స్కూలునుండి అలసిపోయి యింటికివచ్చేటప్పటికి శేషగిరిరావు షోగ్గా తయారయి భార్యసమేతంగా సినిమాకు పోయేవాడు.

ఒక రోజు రాఘవయ్యగారు భార్యనుపిలచి "సరోజ ఏదే ?" అన్నారు.

"అల్లుడుగారు సినిమాకు పిలుచుకువెళ్ళారండీ. ఇంకేంపనుంది." అన్నది జానకమ్మ విసుగ్గా.

"తిన మరిగిన కోడి యిల్లెక్కికూసిందట. అలా వుంది యీయనగారి సంగతి. ఎంత అల్లుడయితే మాత్రం ? ఎప్పుడూ సినిమాలకూ సర్కసులకుతిరక్కపోతే ఏదో తగ్గపని చూచుకోకూడదూ. నాకేమో రెక్కాడితేగాని డొక్కాడదాయె. మనమేమైనా జమిందారులమా ఏమిటి - అల్లుణ్ణి ఎల్లకాలము కూర్చోబెట్టి మేపటానికి." అన్నారు రాఘవయ్యగారు కోపంగా.

"ఇంక విచారించి లాభమేమిటి ? చేసుకున్నవాడికి చేసుకున్నంత." అన్నది జానకమ్మ.

ఇంతలో పొరిగింటి పార్వతమ్మ నూదిదారము కోసం రావటముతో వారి సంభాషణ ఆగిపోయింది. మరో రెండు నెలలు దొర్లిపోయినయ్.

శేషగిరిరావు తిరగటానికి కాళ్ళు నొప్పిగా వున్నయి కాబోలు సైకిలు కావాలని మామగారిని అడిగాడు. ఈయనగారి 'హిరణ్యాక్షవరాలు' తీర్చేటప్పటికి మామగారి తలప్రాణం తోకకివచ్చేది. ఏమైనా తప్పుతుందామరి! అలాగే అప్పో సప్పో చేసి అల్లుడ్ని తృప్తి పరిచారు రాఘవయ్యగారు.

ఒకరోజు జానకమ్మ యింటికి శ్యామలమ్మ వచ్చి మాటల సందర్భంలో "మీ అల్లుడుగారేమి చేస్తున్నా రండీ" అని ప్రశ్నించింది.

జానకమ్మ "ఆయనకు పనీలేదూ - పాటాలేదూ. ఊరికినే తిని తిరుగుతుంటాడు." అన్నది.

"అలాగయితే ఎలాతోస్తుందండీ, "అన్నది శ్యామలమ్మ

"తోచక ఏమిచేస్తుందండి. రేడియోవుండె, పార్కువున్నదాయె. సినిమాలు - పుస్తకాలు - సైకిలు... యిన్నివుంటే తోచక పోవటమేమి టండీ." అన్నది జానకమ్మ.

"బాగా చెప్పారు. ఇలాగయితే కాపురం చేసి నట్లే. అందరిండ్లలో మగవాళ్ళు లేరండీ! ఇలాగే వున్నారా? ఉద్యోగము పురుషలక్షణమని ఊరికినే చెప్పారా మనపెద్దలు." అన్నది శ్యామలమ్మ.

"అది లోకంలో జరిగేసంగతి-నిజమే. కాని మా అల్లుడు అలా కాదండోయ్. అదేమిదేమంటే అలక పాన్పు ఎక్కి కూర్చుంటాడు." అన్నది జానకమ్మ.

ఇంతలో రాఘవయ్యగారు వచ్చారు. శ్యామలమ్మ వెళ్ళిపోయింది. ఆవేళ మధ్యాహ్నం రెండు గంటలకు జానకమ్మ పొరిగింటికి వెళ్ళింది. రాఘవయ్యగారు ఏదో పనిమీద బయటకు వెళ్ళారు. సరోజ బియ్యంలో రాళ్ళు ఏరుతుంది. శేషగిరికి ఏమీతోచటంలేదు. చివరికి 'సరో' అని భార్యని పిలిచాడు.

"ఏమిటండీ పిలచారు." అని బియ్యంచేటతోనే వచ్చింది సరోజ.

"ఆ! ఏమీలేదుగాని ఆ చాట అక్కడ పెట్టి యిలారా."అన్నాడు శేషగిరిరావు.

సరోజ తప్పనిసరిగా చాట చివరగదిలో పెట్టి వచ్చింది.

"ఇప్పుడు టైమెంతవుతుంది?"అన్నాడు.

"షుమారు రెండవుతుందండీ." అన్నది సరోజ.

"సరేగాని మీ యిల్లు యింత పురాతనంగా వుందేం? మనుష్యులు మరీను. ఇల్లన్నాక ఒక గడియారముగూడాలేదాయె." అన్నాడు శేషగిరిరావు క్రొత్తకథను ప్రారంభిస్తూ.

"మా నాన్న ఎండని బట్టే గంట తెలుసుకుంటా రండీ! అలాంటప్పుడు గడియారము అవసరమే ముందండీ." అన్నది సరోజ.

"మీనాన్నకి అవసరము లేకపోవచ్చు - అలా అని నాకుకూడా అవసరములేదంటావా? "అన్నాడు శేషగిరిరావు తీవ్రంగా.

"అయితే మీరనేదేమిటండీ!" అన్నది సరోజ విసుగ్గా.

"నాకు వాచీ కావాలంటాను. తెలిసిందా" అన్నాడు శేషగిరిరావు అసలు సంగతి బయటపెడ్తూ.

"మీరే అడగండి మా నాన్నవచ్చాక." అన్నది సరోజ విసురుగా లోపలికి వెళ్తూ.

ఇంతలో జానకమ్మ వచ్చి "ఏమిటమ్మాయ్. నాన్న అంటున్నావు -" అన్నది.

"ఏమీలేదమ్మా. మీ అల్లుడిగారికి వాచీ కావా లంట." అన్నది సరోజ.

జానకమ్మ రాఘవయ్యగారు వచ్చాక వాచీ సంగతి చెప్పింది.

రాఘవయ్యగారు "ఆ......!!" అంటూ అక్కడే కూలబడ్డారు.



# వ్యవసాయాభివృద్ధి కృషిలో పచ్చిఎరువుల ప్రాముఖ్యం

శ్రీ యం. ఎస్. శివరామన్ ఐ. సి. ఎస్.

—(o)—

ద్వితీయ ప్రపంచ యుద్ధం ప్రారంభమైనప్పటినుంచీ భారత దేశంలో ఆహారపరిస్థితి అసంతృప్తికరంగా వుంటున్నది. అధికాహారోత్పత్తి సాధనకు సాగుపాంతాన్ని పెంపొందించడం రసాయనిక ఎరువుల వినియోగాన్ని ఎక్కువచేయడం మేలు రకం వ్యవసాయ విధానాలను బయలుపరచడం మొదలైన చర్యలు తీసుకోబడ్డాయి. ఈ చర్యల ఫలితంగా ఆహారోత్పత్తి కొంతవరకూ పెంపొందినా జనాభా పెరుగుదలవల్ల కొన్ని వర్గాల ప్రజల ఆహార విధానాలలో కలిగిన మార్పులవల్ల ఏర్పడిన ఆహార అవసరాలకు తగినంతగా ఉత్పత్తులు అభివృద్ధి జెందలేదు.

గత 20 సంవత్సరాలలోను భారత దేశ జనాభా 7 కోట్లు పెరిగింది. అదే సమయంలో నగర జనాభా మూడుకోట్లు పెరిగింది. ఇందువల్ల గోధుమకు, బియ్యానికి గిరాకీ పెరిగింది. కొలది సంవత్సరాలకు వీటి ఉత్పత్తిని పెంపొందించడానికి కృషి జరుగుతున్నా, విదేశాలనుంచి గోధుమ, బియ్యం దిగుమతి చేసుకోవలసి వస్తున్నది.

సాగుబడి భూమి విస్తీర్ణం చెప్పుకోదగినంతగా పెరగలేదు. వీటికితోడు మనం పాలు, కోడిగుడ్లు మాంసం మొదలైన ఆహార వస్తువులు ఎక్కువగా లభ్యమయ్యేటట్లు చూడవలసి వున్నది.

## నత్రజని కొరత

ఎకరాపంటను పెంపొందించడానికి మనమేం చెయ్యాలి? వ్యవసాయోత్పత్తి నేలమీద, నేలలోని పొటాష్, ఫాస్ఫేట్లు, నత్రజని పాళులమీద ఆధారపడివున్నది. భారత దేశంలోని భూములలో ఫాస్ఫేట్లు సమృద్ధిగా వున్నాయిగానీ, అధికవర్ష ప్రాంతాలలోని కొన్ని భూములలో సున్నం తక్కువగా కన్పిస్తున్నది. అన్ని రకాల భూములలోను దేశంలోని అన్ని ప్రాంతాల భూములలోను నత్రజని తక్కువగానే వున్నది. ప్రస్తుతం తక్కువస్థాయిలో జరిగే వ్యవసాయోత్పత్తుల ఫలితంగా భారత దేశంలోని ప్రధానమైన పంటలకు సాలీనా 30 లక్షల టన్నుల నత్రజనిని నేలనుంచి వినియోగించుకుంటున్నాము. దేశమందంతటా పంటనేలలో నత్రజని కొరతగా వున్నందున పంట ఉత్పత్తి తక్కువస్థాయిలోనే స్థిరపడిపోవడం సంభవించింది. ఈ విషయాన్ని గుర్తించకుండా ఎట్టి చర్యలు తీసుకొన్నా ప్రయోజనం వుండదు.

## పచ్చి ఎరువులు, కంపోస్టు ఎరువులు

ఎరువుగా పనిచేసే నత్రజని ప్రధానంగా పశువుల కొట్టావద్దవుండే పెంట

పోగులనుంచి లభిస్తుంది. కాని పశువుల పేడతో పిడకలు మొదలైనవి తయారు చేసి ఇంధనంగా వాడుకొంటున్నందున ఈ పెంటపోగు ఎరువు చాల తక్కువగా లభ్యమౌతున్నది. నత్రజని ఎరువులు యీ సందర్భంలో బాగా పనిచేస్తాయి. కాని ప్రస్తుతం సాగులోవున్న 6 కోట్ల ఎకరాల భూమికి చాలినంతగా ఈ ఎరువు లభ్యం కాజాలదు. గానుగపిట్టు యిందుకు చాల వుపయోగిస్తుంది. అయితే తృణ ధాన్యాల పంటకు ఈ పిట్టును వుపయోగించాలంటే విపరీతమైన ఖర్చు అవుతుంది.

పచ్చి ఎరువులు, గ్రామ ప్రాంతాలలోని కంపోస్టు ఎరువులలో నత్రజని ఎక్కువగా లభ్యంకాగలదు. పచ్చి ఎరువు తృణ ధాన్యాలకు బాగా పనికివస్తాయనీ, ఈ ఎరువు వాడకంవల్ల గోధుమ, బియ్యం పంటలు నూటికి ౨౦ నుంచి ౪౦ వంతుల వరకూ పెరుగగలదని వ్యవసాయ పరిశోధకులు కనుగొన్నారు. అయితే పచ్చి ఎరువు వాడకం నూటికి ౧౦ వంతులు కూడా కన్పించడంలేదు.

ఉత్తర భారతదేశంలో వేసవికాలం, శీతాకాలం చాల తీవ్రంగా వుండడంచేత పచ్చి ఎరువుల విత్తనాలను ఎక్కువ చేయడం సాధ్యంకావడంలేదు. దక్షిణ భారతంలో శీతోష్ణస్థితి చక్కగా వున్నందున పంట రాలుబడి తర్వాత వేసవిలో పిల్లిపిసర, అడివి నీలిమొక్కలువేసి పెంచుతున్నారు. అయితే అప్పుడప్పుడు వేసవిలో వర్షాలుపడడంవల్ల వీటి విత్తనాలు తయారుచేయడం సాధ్యంకావడంలేదు.

భారతదేశంలోని సాగు భూమి లో నూటికి ౨౫ వంతుల ప్రాంతంలో వరి ధాన్యాలు పండించబడుతున్నవి. షుమారు ౫ కోట్ల ఎకరాల వరకు నీటి సౌకర్యాలు లేవు. వర్షాలు మొదట్లో నిలకడగా వుండవు.

## కంపోస్టు ఎరువులు

కంపోస్టు ఎరువులుకూడా పరిమితంగానే లభ్యమౌతున్నాయి. దేశంలోని పంటలు మనుష్యులకు, పశువులకు విని యోగమౌతున్నందున కంపోస్టు ఎరువు తయారీకి చెప్పుకోతగిన వస్తువులు మిగలడంలేదు. షుమారు ౫ కోట్ల ఎకరాలకు అవసరమైన కంపోస్టు ఎరువును తయారుచేయాలంటే యిందు కవసరమైన మొక్కలను పెంచాలి. మేకలు పశువులు తిననటువంటి దుబ్బులను ఎక్కువగా పెంచాలి.

౧౯౫౪-౫౫-వ సంవత్సరాల మధ్య మద్రాసు రాష్ట్రంలోని ప్రభుత్వ వ్యవసాయ పరిశోధన కేంద్రాలలో ఎరువులు కొరతగా వుండేవి. అందువల్ల పట్టణాలలోని కంపోస్టు ఎరువును, పెంటపోగులను,

పిట్టులను కొనేవారు. ఈ పద్ధతికి వెంటనే స్వస్థిచెప్పబడింది. ప్రభుత్వ వ్యవసాయ క్షేత్రాలవారు స్థానికంగా పచ్చి ఎరువులను పెంచాలని ఆదేశించబడింది. ఈనాడు మద్రాసు రాష్ట్రంలోని ప్రతి పొలానికి అవసరమైన పచ్చి ఎరువు, రసాయనిక ఎరువు సమృద్ధిగా లభ్యమౌతున్నది. తొలి పంచవర్ష ప్రణాళికా కాలంలో బియ్యపు పంట అత్యధికంగా పెరిగినది మద్రాసు రాష్ట్రంలోనే. అప్పుడు మద్రాసు రాష్ట్రంలో భాగంగావున్న ప్రస్తుత ఆంధ్ర ప్రాంతంలో బియ్యపు పంట నూటికి 33 వంతులు పెరిగింది. ఈ పెరుగుదలకు పచ్చి ఎరువులే ముఖ్య కారణం. పచ్చి ఎరువుల ఉత్పత్తి క్రమపద్ధతిలో కొనసాగితే మంచి ప్రయోజనాలున్నాయి.





న్యూఢిల్లీలోని సెంట్రల్ ఆసియన్ మ్యూజియమందలి వస్తువులలో నీ చిత్రమందలి పట్టు పతాకము ఒకటి. దీనిపై ఒక చైనా చక్రవర్తి, ఆయన భార్య చిత్రించబడినది.

# అగ్నిజ్వాలలు

మూలం :
శ్రీ భైరవ ప్రసాదగుప్త

అనువాదం :
శ్రీ పురాణపండ రాధాకృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

"మీకీపీరియడ్ కాళీయేనా?" "ఇలాంటి పీరిడ్ లు ఎన్నివస్తూపోతుంటాయో కాని మీలాంటి వారు రావద్దూ" అంటూ శశివేపు మధుర దృక్కులను ప్రసరింపజేసాడు.

"నడవండి"

ఇద్దరూ వెళ్ళి కూర్చున్నారు. ఇది అదే రెస్టారెంట్. అదే స్థలం ఒకానొకనాడు జగదీశ్ రాధను తీసుకువచ్చాడు.

హోటల్ బోయ్ కేక్ ప్లేట్స్, టీపెట్టి కర్టెన్ లాగి వెళ్ళిపోయాడు జగదీశ్ శశికేసి యిలా పల్కాడు.

"తినండి"

శశి కల్పించి ప్రారంభించింది "ఇవ్వాళ బాగా తినివచ్చాను. ఏం కాళీగాలేదు. సరదాకిమాత్రం వచ్చాను మీతో"

"సరదాగావచ్చారుకనుక - సరదాగానే తినండి" అంటూ ఒకేక్ తీసి శశివైపు పోనిచ్చాడు జగదీశ్.

"ఓ హో హో మీరనవసరంగా శ్రమపడకండీ. అలా ఉంచండి. మీరు మాట్లాడితేనే నాకడుపు నిండిపోతోంది" అంటూ నవ్వుతూ శశి జగదీశ్ చేతిని తాకుతుపల్కింది.

"చూడండీ! నేను చాలా సరదామనిషిని. ఈకేక్ ని మీ పెదములకందిస్తే మీరు తినకతప్పదు అందుచే..." అంటూ కేక్ ఉన్న తనచేతిని శశివైపు ఎత్తేసరికి శశి తలదించుకుని "నా అదృష్టం మీ ప్రేమ పూర్వకమైన చెయ్యి ......"

"ఓహో!" జగదీశ్ ఆర్ద్రకంఠంతో పల్కాడు "నాకు యింతవరకు తెలియదు: మీరంతవరకూ నాచేతిని ... "

"లేదు లేదు ఏమిటలా అంటున్నారు. అలా అనుకుంటే మీ పట్టుదలకి జ్ఞాపకార్థం ..." అంటూ మాట పూర్తిచేయకుండానే శశి తనచేతిని జగదీశ్ చేత ఉంచింది.

గంభీరంగా కనులలో ప్రకాశవంతమైన కాంతితో జగదీశ్ యిలా అన్నాడు. "మీకు బహుశా యీ విషయం తెలియకపోవచ్చు. మానవుడు ఒకవ్యక్తిని ఎంతగా అయితే కోరుతూంటాడో అంతగా యితరులదగ్గఱ ఆవ్యక్తిమీద తనకుద్వేషం ఉన్నట్లూ ప్రవర్తిస్తూంటాడు. సరే మీరు తీసుకోపోతే నామీద ఒట్టే — నాచేత్తో మీరీ కేక్ తినాలి" అంటూ జగదీశ్ కేక్ ని శశి పెదవుల కందించాడు.

శశి ఓసారి ఓరకంట జగదీస్ ను చూస్తూ - ఓసారి యిటూ అటూ చూస్తూ పేరుకి కేక్ ని తినసాగిందిప్పుడు జగదిశ్ యిలా అన్నాడు — "చూడండీ, నా వేలు మాత్రం కొరికెయ్యకండేం."

శశి గట్టిగా నవ్వింది.

"చాలెద్దూరూ! మీరు మరీనూ"

"మరి. మీరో — మీరుకూడా—భగవంతుడి మీద శపథం చేసి చెపుతున్నాను. తక్కువవారుకారు" మరలకొంచెంసేపు ఆగి గంభీరంగా యిలాఅన్నాడు "చూడండీ! నేను చాలకాలంనుంచి మీతో ఏకాంతంగా మాట్లాడాలనుకుంటున్నాను"

"అటువంటి సదవకాశంకోసం నేనెంతబాధపడుతున్నానో మీకేం తెలుసు!" ఆమె పలుకుల్లో గాంభీర్యం తొణికిసలాడింది.

"ఓహో! అయితే అయితే కత్తికిరెండువైపులా పదును ఉందన్నమాట. సరే నేనేదైనా చెబితే మీరు చెడుగా భావించరుగదా? నేను చాలా సరదామనిషిని. ఏ విషయాన్ని మనసులోనుంచుకుని దానికై బాధపడడం నాకెంత మాత్రం యిష్టంలేదు. అంచేత ఆరంభంలోనె అన్ని విషయాలు నిర్ధారణ చేసికుంటాను."

"మీభావాలునాకు చాలా ఆనందాన్ని కలిగిస్తున్నాయి. నా భావాలుకూడా సరిగ్గా అంతే, అకారణంగా హృదయంలో బాధను రేకెత్తించుకోడం నాకు సుతరామూ యిష్టంకాని పని," శశి కళ్లు యిటూ అటూ త్రిప్పి పల్కింది.

"అయితే ఒక్కమాటలోనా హృదయగతీభావం చెప్పాలంటే నాకు మీమీద ప్రేమ కల్గింది, చెప్పండి మీకుకూడా నా విషయమై అటువంటి భావమేమైనా కల్గిందా?" అంటూనే జగదీశ్ శశి చేతులమీద తన చేతులుంచాడు

శశి అతని చేతుల్నిమృంతగట్టి నిట్టూర్చి యిలా అంది - "ఆహా! పరమేశ్వరుడెంతమంచి వాడు, బాధ ఎదటి హృదయంలో ఉండి యిక్కడ ఉండకుండా చేస్తాడా!"అంది కళ్ళు మూసుకుని పరమేశ్వరుని ధ్యానిస్తూ - ఆనందించసాగింది.

"అవును అంతే నిజం యీవేళ నామనస్సు అంటూనే ఉంది—ఈ వేళ శశీ నేనెంత ఆనందంగా ఉన్నాను! ఆహా! ఆహా!! ఒకేయ్ బోయ్_"

"ఎందుకు? ఇప్పుడు బోయ్అవసరం ఏంవచ్చింది ఏం కాఫీ యింకా బాగా చల్లార్చాలా?" అంది శశి నవ్వుతూ.

"కాదు యిప్పుడు నాకు మురిపోయే కప్పులు అక్కర్లేదు. ఇప్పుడు మంచులాంటి కప్పులుకావాలి. కంఠందాటిన తరువాత హృదయంలో వేడిపుట్టించాలి నేను ఆనందంగా ఉన్నాను. శశీ! నిజానికి నా ఆనందానికి అంతుకాని దరికాని ఏమైనాకాని ఉన్నాదేమో చెప్పగలవా?" అంటు శశి చేతిని ముద్దెంటుకుంటూ పల్కాడు జగదీశ్!

"వద్దు ఇప్పుడొద్దు నడవండి. మరొకసారి" చిరునవ్వుతో పల్కింది శశి.

"కాని యిప్పుడు నాకు కాలేజీకి రావాలని లేదూ" శశి వదనంలోకి చూస్తూ పల్కాడు జగదీశ్.

"కాని మీ కారు అక్కడే ఉందే" శశి కారు వైపుచూపింది.

"ఒహో సరే ఐదునిముషాలసేపు ఆగు. ఇప్పుడే కారుతీసుకుని వస్తాను." అంటూ తడబడు అడుగులతో జగదీశ్ రెస్టారెంటునుంచి బయటకు వెళ్ళిపోయాడు.

రంగును రంగుతోకలపడానికి అట్టేసమయంపట్టదు. జగదీశ్, శశీ యిద్దరూ శరీరం - ఛాయకిగల అవినాభావసంబంధంగా ఎప్పుడు మారారో వారికే తెలియదు. కాలేజీ - క్లబ్బు, సినీమా - షికారూ — హోటల్ కిఎక్కడికైనా జగదీశ్ శశీయిద్దరూకలసియే వెడుతున్నారు. శశి జగదీశ్ యింటికి వెడితే సుధ ఆమెనివదినా! వదినా!! అని పిలువసాగింది. సుధ తల్లి ఎప్పుడేనా కల్పుకోడం తటస్థిస్తే శశి వినయంగా అత్తగారి దగ్గఱ ప్రవర్తించినట్లు ప్రవర్తిస్తోంది. అప్పుడు సుధ తల్లి యిలాఅనేది — "మా యింట్లో ఉంటావా? అమ్మా"

"మా నాన్నగార్ని అడగండి" అనేది సిగ్గుతో శశి.

"భలేదానివి - యేం ఎందుకు అడుగుతాం మేం మొగపెళ్ళివారం! మీ నాన్నగారితో నీవెందుకు చెప్పకూడదూ"? అని సుధ తల్లి సగర్వంగా పల్కేది.

"బాగా మాట్లాడుతున్నారే? నేనేమైనా మీ అబ్బాయికంటె తక్కువదానినా?" అనేది కొంచెం సిగ్గుతో శశి.

"మా అబ్బాయికంటె తక్కువ దానివికాక పోయినా నీవు అమ్మాయివేగా! మీ నాన్నగారి ముక్కుపిండక-జాగ్రత్తగా ఉండడంమంచిదిఅనేది." ఆ సమయంలో శశి ముక్కుమీద వేలేసుకుని పారిపోయేది. సుధ తల్లి నవ్వుతూ - "ఓహోహో, ఎంత అందమైనపిల్ల. అదీగాక లక్షలకొద్దీ ఆస్తికివారసురాలు. పరమేశ్వరుడనుగ్రహిస్తే మా కోడలవక మానదు" అనుకుని నీళ్లునమిలేది.

4

రాధ ఆలోచించలేక అలసిపోతుంది ఎంత ఆలోచించినా దరితోచటంలేదు. అంతా అగమ్యగోచరంగా ఉంది. జగదీశ్ తననుచూచిన పుడల్లా ఎందుకలాపిరికివానిలా దోషిలాకంపించిపోతున్నాడు. అకస్మాత్తుగా ఒంటరిగా కలుసుకోవడం తటస్థిస్తే రాధ ఏదో చెప్పాలనుకునేది కాని అతడు "నాకుయిప్పుడు చాలా తొందరపని ఉంది. మరోసారి మాట్లాడవచ్చులెండ"అని ఎప్పటికప్పుడే వెళ్ళిపోయేవాడు. తనతో మాట్లాడం - తనని కలుసుకోడం అతనికిష్టంకానిపనా? ఒకవేళ నేను కథ ఇవ్వలేదని దాని విషయమై కోపగించి యుండలేదు కదా! పోని అవకాశం వస్తే ఆ కథ విషయం చెప్పేద్దామని ఆమె ప్రయత్నిస్తూనేఉంది. శశి తనవివశత్వం వల్ల ఎలా లాభంసంపాదించకల్గిందీ ... మొదలైన విషయాలు ... కాని కథ విషయంకూడా యింత పట్టుదలకు కారణమా? అయితే ప్రేమకథలంటే ఆకర్షించబడుతుందా? ఛా! ఛా!! భలే అదేలా వీలౌవుతుంది! మరింక ఏంజరిగింది. ఎంచేత జగదీశ్ తనతో మాట్లాడంలేదు. అతనిలో వచ్చిన మార్పేమిటి? రాధ హృదయం వ్యథతో విలపించిపోతుంది. జగదీశ్ మీద పాపం ఆమె ఎన్ని ఆశలుఉంచుకుంది ఇక ఆమె ఆ సమయంలో నిశ్శబ్దంగా ఊరుకోలేదు. ఆమె అడుగుతుంది. ఒకసారి తప్పక అడుగుతుంది.

కాని చాలా రోజులు నిరీక్షించినతరువాతకూడా జగదీశ్‌ను కల్సుకునే అవకాశం లభించలేదు. జగదీశ్ ఆమెకు ఆ అవకాశాన్నియలేదు అటువంటిసమయంలో రాధ అతన్ని నల్గురిలో ఉండగా జబర్దస్తీగా ఎలా ఆపగలదు. విచిత్రమైన వివశత ఆమెను బాధించసాగింది. ఇలా ఎప్పుడైనా ఎక్కడైన జరిగిందా?

ఈ సంఘర్షణలోనే తాను జగదీశ్‌కు ఒక ఉత్తరం ఎందుకు వ్రాయకూడదూ అనుకుంది. ఉత్తరం తప్పక చదువుతాడు. తాను ఆ లేఖలో తన బాధనంతా వ్యక్తపరచాలి. అప్పుడు చూస్తా జగదీశ్ ఎందుకు మాట్లాడడో?"

ఉత్తరం వ్రాయాలని కూర్చుంది. ప్రారంభించిందోలేదో "అక్కా! అక్కా!" అంటూ శశి అరుచుకుంటూ రాధ గదిలోకి వచ్చిపడింది. రాధ చేతుల్లో కలంచూసి అంది "ఏం అక్కా ఏదైనా కథ వ్రాస్తున్నావా?"

రాధ శశి దగ్గఱ ఊరికనే కూర్చుంటోంది, ఏనాడైతే శశి ఆమెను కథ అడిగితీసుకు వెళ్ళిపోయిందో నాటినుంచి రాధ గదిలోకి రావడం మానేసింది. కాలేజీకి వెళ్ళేటప్పుడే కారులో కూర్చున్నంతసేపు ఏవో విషయాలు మాట్లాడేది. కాని యిప్పుడదు అలాంటిపనులేవీ చేయక నిశ్శబ్ధంగా కూర్చుటోం. ఆ తరువాత ఆమె యిప్పుడు ఎక్కడికి వెడుతుందో ఏంచేస్తుందో రాధకి తెలియటంలేదు. ఈమధ్య ఓ సారి కాలేజీనుంచి తనతో తిరిగి రాలేదుకూడా. ఇప్పుడు కథ విషయం శశి నోటినుంచి వచ్చేసరికి రాధ హృదయం ఆవేశపూరితమైపోయింది. ఆమెకి "పాము - పక్షికథ జ్ఞాపకానికి వచ్చింది. పాము ఎల్లప్పుడూ గ్రుడ్లను తినేయాలని ఆ సదవకాశంకోసం నిరీక్షిస్తూండేది. ఎప్పుడు పక్షి గ్రుడ్లు పెట్టేదో అప్పుడే పక్షి ఆ గ్రుడ్లను తినేసేది. ఆ పక్షిలాగా రాధకూడా వివశయైపోయింది. కాని శశి ఒక విషయం గుర్తించాలి. రాధ పక్షిలాగ మాటాడలేనిదనికాని - మస్తిష్కంలేనిదనికాని కాదని తెలుసుకోవాలి. ఆమె అంతా అర్థంచేసుకుంటోందికాని ఏంచెయ్యకలదు? వివశురాల్లా ఊరికే యిలా సమాధాన మిచ్చింది - "అవును. ఆ విషయమేఆలోచిస్తున్నాను."

(సశేషము)




శ్రీ రాజరాజేశ్వరివారి...

# "శ్రీ కృష్ణమాయ"

<u>చిత్ర సమీక్ష</u>

ఆత్మస్తుతి, పరనింద, అహంకారం వృద్ధిచెంది విర్రవీగే ఏ వ్యక్తిని ఆది దేవుడు మన్నిస్తాడనేది కల్ల. సృష్టికర్త బ్రహ్మదేవుని మానసపుత్రుడు, ముల్లోకసంచారి—విజ్ఞాని; నిరంతర భగవంతుని స్తుతించే నారదమహర్షి – ఈ మూడింటికి లోబడడం జరిగి అందుకు తగిన విధంగా శ్రీ కృష్ణుని చేత పరాభవించబడతాడు. శ్రీ కృష్ణుడు ఆ మహాముని, అస్ఖలిత బ్రహ్మచారినను అతని వ్రతాదీక్ష భంగానికి కారణభూతుడౌతాడు. మహాముని మహతినే మాయ (కన్య)గా మార్చి, నారదునకు మోహాతిశయాన్ని రేకెత్తించి - వివాహం చేసుకొనేటట్లు చేస్తాడు. భగవన్నామ సంస్మరణ పూర్తిగా వీడి నారద మహర్షి సంసార యాత్రలో – ఏటికేటికి పెరిగే సంసారపోషణకు - అష్టకష్టాలు, యమ బాధలు పడడం – యిదే ఈ చిత్రానికి మూలకథ – యిదే కృష్ణమాయ (నారద సంసారం)

చిత్రం ఆద్యంతం చాలా రసవత్తరంగా సాగింది. ప్రతి ఒక్క దృశ్యం చాలా ఆకర్షణీయంగా చిత్రింపబడింది.

ఈ చిత్రానికి మాటలు, పాటలు రావూరి సత్యనారాయణ వ్రాశారు. అవి చాలా బాగున్నాయి. ఈ చిత్రానికి దర్శకత్వం శ్రీ సి. ఎస్. రావుగారు వహించారు. చిత్రాన్ని చక్కగా నిర్మించారీయన.

ఈ చిత్రంలో ప్రత్యేకంగా కొన్ని పాటలు – నారద మహర్షి చేత కుచేలోపాఖ్యానం హరికథ ప్రత్యేకాకర్షణ.

ఈ చిత్రంలో నారదుడుగా శ్రీ నాగేశ్వరరావు, మాయ గా జమునగార్లు చక్కగా నటించారు. యితర నటీనటులు పాత్రకు తగిన విధంగా నటించారు. ఈ చిత్రం ఆంధ్ర దేశమంతటా ప్రస్తుతం విజయవంతంగా సాగుతున్నది. ఈ చిత్రాన్ని చమ్రియా వారు విడుదల చేశారు.

## బి. ఎన్. రెడ్డిగారికి అభినందనలు

వాహిని సంస్థ అధిపతి - ఆంధ్ర ప్రముఖ దర్శకులు - శ్రీ బి. ఎన్. రెడ్డిగారు, ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నూతనంగా ఏర్పరచిన లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు గవర్నరుచేత నామినేట్ చేయుబడ్డారు. ఈ సందర్భంలో మా హృదయ పూర్వక అభినందనలను అందజేస్తున్నాము.

అమంచర్ల మల్లికార్జునరావు

---

# సినీతార షర్లీ టెంపుల్

ఐదవ ఏటనే బాలతారగా జగద్విఖ్యాతి గాంచిన షర్లీ టెంపుల్ నేడు 30 సంవత్సరాల మాతృమూర్తి, చలనచిత్ర సీమనుంచి కొన్నేళ్లుతప్పుకొని ఇటీవల తిరిగి ప్రవేసించింది. షర్లీ టెంపుల్స్ 'స్టోరీబుక్' అనే సొంత టెలివిజన్ కార్యక్రమానికి ఆమె వ్యాఖ్యానం ఇస్తూ, రెండుపర్యాయాలు తారగా టెలివిజన్‌లో కనిపిస్తుంది.

"వయస్సులో మార్పు కనిపిస్తున్నది కాని, నటనలో హావభావ ప్రకటనలో ఆ చిన్నారి పొన్నారి చిలిపితనం ద్యోతకమవుతూనే ఉన్నది. ఆ టెలివిజన్ కార్యక్రమమైన 'డ్రీమ్స్ ఆర్ మేడ్ ఫర్ చిల్డ్రిన్' అనే గేయాన్ని ఆమె ఆలాపించినప్పుడు ఆమె గాత్రంలో లక్షలాది ప్రేక్షకులను మంత్ర ముగ్ధులుగా చేసిన మాధుర్యం క్షణ క్షణానికి ఉప్పొంగి పోతూనే ఉన్నది," అని ఒక విమర్శకుడు వ్రాశాడు.

షర్లీ టెంపుల్ తన ఐదవ ఏటనే ఖండాంతర విఖ్యాతి గాంచింది. ఏడవ ఏట తాను నటించిన ప్రతి చిత్రానికి అక్షర లక్షలు కురిపించింది. ఎనిమిదవ ఏట ఆమెను తీసినన్ని ఫోటోలు ప్రపంచంలో మరెవ్వరికీ తీయలేదు. నటన తప్ప వేరే వ్యాపకమే లేదు. నేడు ఆమె మిసెస్ చార్లెస్ అల్డెన్ బ్లాక్; ముగ్గురు పిల్లల తల్లి. గత ఎనిమిదిసంవత్సరాలుగా ఆమె గృహలక్ష్మి. "నాకు ఈ సంసార జీవితం నిజంగా ఎంతో ఆనందంగా ఉన్నది" అంటుందామె.

ఆమె వివాహం అయిన తర్వాత, చలన చిత్రాలలో నటించమని ఎన్నో ఆహ్వానాలు వచ్చినవి. వాటి నన్నింటినీ తిరస్కరించింది. గత సంవత్సరం టెలివిజన్ ప్రసారంలో ప్రఖ్యాత జానపద కథలు, వీరుల గాథల కార్యక్రమాలు నిర్వహించ వలసిందిగా ఆమెను కోరారు.

"మొట్ట మొదట 'నో' అని చెప్పేశాను. నా కుటుంబాన్ని వదలి హాలీవుడ్‌కు తిరిగి ఎందుకు వెళ్ళాలి? కాని ఆవిషయమై నా భర్తచార్లీతోనూ, మా పిల్లలతోనూ ప్రస్తావించాను. వారంతా 'ఎస్' అన్నారు. అప్పుడు నేనూ 'ఎస్......ఎస్' అన్నాను."

తన కుటుంబం ఇచ్చిన మద్దతు మూలంగానూ, ఆ కార్యక్రమాలలోగల ప్రాశస్త్యం వల్లనూ, షర్లీ వాటిని నిర్వహించటానికి ఒప్పుకొన్నది.

"ఆ కార్యక్రమాలను గురించి తల్లి మనస్సుతో ఆలోచిస్తుంటాను. నాకు ఏది ఇష్టమో, నా పిల్లలు చూడటానికి ఏదంటే ఇష్టపడతారో నాకు తెలుసు. నేను ఈ కార్యక్రమాలకోసం నెలకు మూడు రోజులు హాలీవుడ్‌లో ఉంటే చాలును గనుక ఒప్పుకున్నాను"

అమెరికాలో డచ్ ప్రజలు స్థిర నివాసం ఏర్పరచుకొన్న తొలిరోజుల నాటి ఒకకథను ఇతివృత్తంగా తీసుకొని వాషింగ్టన్ రచించిన "ది లెజెండ్ ఆఫ్ స్లీపీ హాలో" ప్రదర్శనా పరంపరలో మిస్ టెంపుల్

తొలిసారిగా నటించింది. "అందచందాల భాగ్యశాలి కాత్రినా వాన్‌టౌనెడ్‌గా, మిస్ టెంపుల్ నటన అత్యద్భుతం. హీరోయిన్‌గా ఆమె ప్రదర్శించిన వంపుల వయ్యారం, ఇంపైన వాచకం, డవ్ వన్నెల మిన్నగా ఆమె చూపిన తళుకు బెళుకులు వర్ణనాతీతం" అని న్యూయార్కు హెరాల్డ్ ట్రిబ్యూన్ పత్రికా విమర్శకుడు వ్రాశాడు.

షర్లీ టెంపుల్ తన చిన్నతనంలో బాల సరస్వతి అవతరించినట్లు నటనా కౌశలాన్ని చూపినప్పుడు ఆనాటి పెద్దలు ఎంత సమ్మోహితులయారో, ఈనాటి అమెరికన్ బాలలు ఈ మాతృమూర్తి టెలివిజన్‌లో నటించడం చూచి అంతటి ఆనంద హృదయులవుతున్నారు.

ఆమె నటించిన నాటి చిత్రాలలో అత్యంత ప్రజారంజకమైన, 'క్యాప్టెన్ జనవరి'. 'పి విర్లీ వింకీ', 'హైడీ', 'ది లిటిల్ కర్నల్' మొదలైన చిత్రాలు టెలివిజన్ ద్వారా ప్రసారం చేస్తున్నారు. ప్రపంచ ప్రేక్షకుల హృదయాలను ఆనంద డోలికలలో ఊగించిన ఆమె చిన్నారి నృత్యాలను, సంగీతాన్ని, మరొకసారి కని వినే అవకాశం చిక్కింది. ఆ రోజులలో ఆమెతో నటించిన కీర్తిశేషుడు లయొనెల్ బారీమూర్ ఆమెను "అత్యద్భుత ప్రతిభాశాలిని అయిన దేవబాల" అని వర్ణించారు ఆమెతో నాలుగు చిత్రాలలో నటించిన జేమ్సుడన్ "షర్లీ అతి సహజ నటనా చాతుర్యాన్ని నేనెక్కడా చూడలేదు" అని మెచ్చుకొన్నాడు. ఆమె ఆరవ ఏట, అమెరికన్ అకాడమీ ఆఫ్ మోషన్ పిక్చర్స్ అండ్ సైన్సెస్ సంస్థ "1934 సంవత్సరపు అసమాన నటీమణి"గా ఆమెకు ప్రత్యేక 'ఆస్కార్' ప్రతిను బహూకరించింది.

1932 లో నటీనట వర్గంకోసం వెతుకుతున్న ఒక చలనచిత్ర నిపుణుడు (చార్లెంట్ స్కాట్) ఒక ప్రోత్సాహిక నాట్య పాఠశాలలో షర్లీ టెంపుల్‌ను కలుసుకొన్నాడు. అప్పటినుంచి ఆమె 18 సంవత్సరాలపాటు చలన చిత్రాలలో నటించి అనన్య సామాన్యమైన ప్రఖ్యాతి సంపాదించింది. "నా జీవితాంతంవరకు ఇది చాలు" అంటుందామె.

1950 లో ఆమె చార్లెస్ బ్లాక్‌ను వివాహమాడింది. అప్పుడు ఆయన అమెరికాలో నావికాదళంలో ఆఫీసరుగా ఉండేవాడు. ప్రస్తుతం ఒక పెద్ద వ్యాపార సంస్థ మేనేజరుగా ఉన్నాడాయన. "చలన చిత్ర రంగాన్ని విడిచిపెట్టి వివాహం చేసుకోవాలని నేను నిశ్చయించుకొనడమంటూ ఎన్నడూ జరగలేదు. కాని ఆ ఘడియ వచ్చేసరికి, అలా జరిగిపోయింది" అంటుంది మిసెస్ బ్లాక్.

ఆమె సకుటుంబంగా కాలిఫోర్నియాలోని అథెర్టన్‌లో నివసిస్తున్నది. బజారుకు వెళ్ళి వస్తువులు వగైరా కొనుక్కొని రావటం మొదలైన గృహ కృత్యాలను స్వయంగా చేసుకొంటుంది. "నాకు వంటచేయటం, తోటపని, తదితర గృహ కృత్యాలు చేయటమంటే మహా సరదాగా ఉంటుంది" అంటుందామె.

గృహాలంకరణలు అమ్మే షాపులో కాన్సేపు పని చేస్తుంది. 150 మంది మహిళలు సమిష్టిగా స్థాపించిన బాలల థియేటర్ కార్యక్రమాలలో ఎంతో శ్రద్ధ తీసుకొంటుంది. సాంఘిక సేవలంటే ఆమె కెంతో ప్రీతి. బాలల సంక్షేమంకోసం పాటుబడే అనేక సంస్థలలో ఆమె స్వచ్ఛంద సేవికగా పనిచేస్తుంది.

"కాని నేను ఏపని చేసినా నా భర్త ఆఫీసుకు ఉదయాన వెళ్ళి సాయంత్రం తిరిగివచ్చే లోపుగానే చెయ్యాలి. నాకు ప్రస్తుతం అన్నిటికంటే ముఖ్యమైనది నా వైవాహిక బంధమే. నా భర్త చార్లీని సంతోష పెట్టటం కంటె, నాకీ ప్రపంచంలో కావలసిందేదీ లేదు. అటుపిమ్మట మాపిల్లలు, అన్నిటికంటే చివర నా నటన" అని అంటుంది ఆ ఆదర్శ గృహిణి షర్లీ టెంపుల్.

—U.S.I.S

—X—

# కామాయని

మూలం :

శ్రీ జయశంకరప్రసాదు

అనుసరణ :

శ్రీ కొంపెల్ల సోమేశ్వరశర్మ బి. ఏ.

(గత సంచిక తరువాయి)

మనువుతో నిట్లు సంభాషించుచుండగనే తనలోని కామవాసనల ప్రాబల్యముచే శ్రద్ధ తానుత్తేజితమైనది. ఆమె యరుణాధరము లెందులకో తీవ్రముగ తపింప జొచ్చినవి. ఆమె యవస్థను చూచి "ముందు సోమరసమును సేవింపుము, తరువాత చూతము లె"మ్మనుచు మనువు పాత్రము నందించినాడు. అతని వచనము లామె హృదయములోని రాగ తంత్రులను మీటి రమ్యధ్వనులు కల్పించినవి. ఆమె సోమరసపానము నెట్లు నిరాకరించగలదు? ఆమె లలితాధరములం సోమరసమున మునిగినవి. ఆమె కండ్లు ప్రియుని నేత్రములలో కలసినవి. ఆమె యంగ ప్రత్యంగములు నవచేతనా భరితములైనవి, మనువామెతో ప్రేముడి యుట్టిపడునట్లుగా నిట్లు పలికెను "శ్రద్ధా నేటిరాత్రి నీ ముఖ బింబము చందమామతో సాటిగా శీత కిరణ వికీర్యమాణమై విలసిల్లుచున్నది! ప్రియా, నీవు నా జీవనానందమునకు చరమావధివి కమ్ము! నీకును నాకును మధ్యనున్న లజ్జా యవనిక ఇరువురిని చెరియొకవైపున నంధకారమునకు త్రోయుచున్నది. దానిని తొలగింపుము. నా మేనిలో మేనివై, ప్రాణములో ప్రాణమువై కలసిపొమ్ము—" శ్రద్ధ వాసనా వశయై మౌనము వహించెను. మను వొక్కపరి యామెను గాఢ పరిష్వంగన మొనర్చి, చుంబనముల వర్షమును కురిపించినాడు. వారిలోని భిన్నత నశించినది.

## ఈర్ష్య

శ్రద్ధామనువుల భోగ ఫలితముగ శ్రద్ధ గర్భమును ధరించినది. ఆమె దేహచ్ఛాయ తెల్లగ పాలిపోయి, శరీరము కృశించుటవలన మనువునకామె యనాకర్షణీయమైనది. ఆమెయొక్క చంచల సౌందర్యముల స్థానమును సరళత యాక్రమించినది.

శ్రద్ధయొక్క ప్రేమలో పూర్వపు హావభావ ప్రేమాలాపములుగాని గాఢ పరిష్వంగ వాంఛలుగాని, కానరాకుండెను. ఒకప్పుడామె ముఖ మండలము మందహాస కాంతులను ప్రసరించుచు, గాఢమైన యాకాంక్షతో నాతని చలింపజేసెడిది. పూర్వపు ప్రేమాలాపము లంతరించినవి. ప్రణయ కోపములు నశించినవి. ఉల్లాసరహితయై, స్మితరేఖా విహీనయై యామె ఎల్లప్పుడు నేదో పనిచేయుచు కాలము గడపెడిది. ధాన్యము నేరి, దంపి శుభ్ర మొనర్చుట, ధాన్య బీజములను సంగ్రహించుట కదురులతో నూలు తీయుట మొదలగు గృహకార్యము లామెకు నిత్యకృత్యములైనవి.

ఆమె యందలి యాకర్షణశక్తి దూరమగుటవలన మనువు తరచుగ నామెను వీడి వనసీమలకు పోవుచు మృగయా వినోదమున నానందించుచుండెడివాడు. కొంతకాలమున కతనికి మృగయావ్యసనముగూడ సంతృప్తి నీయజాలక పోయెను. అతని జీవితములో వర్తమానదశ యంత్యమును సమీపించినది. అతనిలో స్వకీయ ప్రభుత్వమును స్థాపించవలెనను వాంఛ తలయెత్తినది.

(సశేషము)




**జాతీయ భారతి : శ్రీ పైడిపాటి సుబ్బరామశాస్త్రి, మారుతీనగర్, విజయవాడ వెల రు. 2-50.**

ఇందలి జాతీయగీతాలు పండిత పామరుల ప్రొగడ్తలనందుకున్నవి. గీతములు భావగర్భితములై, ఉద్రేక పూరితములుగానున్నవి. ఉత్తమస్థాయిలో వ్రాయబడిన యీకవిత గ్రంథకర్త హృదయమునుండి వెలువడిన వెల్లువగా తోచుచున్నది.

జాతీయతను, దేశభక్తిని, ఉత్తమ ఆదర్శలక్ష్యాలను బోధిస్తున్న యిందలిగీతాలు యావత్ప్రజానీకం పఠనయోగ్యములేకాక గానంచేయుటకనువైనవి. ఇందలి చిత్రాలు గ్రంథాన్ని మరింత ఆకర్షణీయంగా చేసినవి.

**గ్రామవైద్యుడు, అనువాదకులు : శ్రీ యన్. ఆర్. చందూర్. ప్రచురణ కర్తలు: కుబేరా ప్రింటర్సు లిమిటెడ్, సుంకురామచెట్టి స్ట్రీటు, మద్రాసు 1. వెల 50 నయాపైసాలు.**

ఒకవ్యక్తి తాలూకు కథగా వ్రాయబడినా, యిది ఆర్థర్ ఇంహోర్ట్ జలర్ తన స్వీయచరిత్రయని చెప్పలేకపోయినా గ్రామవైద్యుల చరిత్రగా పరిగణించాలి. ఇది గ్రంథకర్త కాలంనాటి కథ. ఇందులోని విషయాలు అందరు గ్రామవైద్యులకు సంబంధించినవి. గ్రామవైద్యుల దృక్పథమును, వారి అనుభవాలను బహు చక్కగా గ్రంథకర్త చిత్రించాడు, దానిని శ్రీ చందూర్ గారు కడు సమర్థంగా ననువదించారు. చదువుచున్నంతసేపు ఉల్లాసకరంగానుండు పుస్తకము.

**నెహ్రూకావ్యము (తొలిపాలు): విద్వత్కవిభూషణ, విద్వాన్ వేదము వేంకట కృష్ణశర్మగారు. ప్రతులకు ఉదయరంజనీ పబ్లిషర్సు చూళ, మద్రాసు 7. వెల రు. 2-75.**

భారత ప్రధాని పండిత నెహ్రూ జీవిత చరిత్రను పద్యకావ్యంగా గ్రంథకర్త రచించారు. ఇందలి చరిత్రాంశములను సేకరించి ముద్దుల మూటగట్టు సరళిలో మనోజ్ఞంగా రచించిన యీ కావ్యము పండిత పామరులకు పఠనీయము. ఉన్నత విద్యాభ్యాసము చేయు విద్యార్థులకు పాఠ్య గ్రంథముగా నుండతగినది.

పండిత శర్మగారి కవిత్వము, వారి పరిశోధనా కృషిపట్ల ఆసక్తి అసాధారణములు. వారి ఉత్తమ కవితలు సారస్వత రంగంలో మార్గదర్శకములు, ఆదర్శనీయములు. వారు భగవంతుని దయవలన ఆయురారోగ్యాలతో బాటు, ప్రజాదరాభిమానములతో మరింతగా సారస్వతసేవచేసి ఉత్తమోత్తమ గ్రంథాలను రచించాలని ఆశిస్తున్నాము.

---

# సంపాదకీయములు

## అభినందనలు

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము (తిరుపతి) కు రు. 25,000 లు విరాళమునిచ్చిన సుప్రసిద్ధ సినిమాతార శ్రీమతి అంజలీదేవిని, కేసరి విద్యాలయము (త్యాగరాయనగరు) నకు రు. 25,000 లు వాగ్దానముచేసి హైస్కూలగుటకు తోడ్పడి, భవన నిర్మాణమునకు, యితర వసతుల సమర్చుటకు ప్రత్యేక శ్రద్ధ చూపుచున్న వాహినీ స్టూడియోస్, విజయా స్టూడియోస్ మేనేజింగ్ డైరెక్టరు శ్రీ బి. నాగిరెడ్డిని హృదయ పూర్వకంగా నభినందిస్తున్నాము.

అనేకమంది సంపన్నులు, వేలకు వేలు ఆదాయము గడిస్తున్నవారున్నారు. కాని అవసరాన్ని గుర్తించి ప్రజాహితమునకై ఉదారంగా విరాళము లిచ్చిన వారిలో శ్రీ నాగిరెడ్డి, అంజలీదేవిగార్లు పేర్కొన తగినవారు.

ప్రజాహితమును ప్రోత్సహించుటలో ముందంజ వేయుట, శాశ్వతమైన కీర్తి ప్రతిష్టల నార్జించి పెట్టుటయేకాక జాతీయ అభ్యుదయ పురోభివృద్ధులను సమకూర్చగలవని గుర్తించి శ్రీమతి అంజలీదేవిని, శ్రీ బి. నాగిరెడ్డిగారిని ఆదర్శంగా తీసికొని ఉదారంగా కేసరి విద్యాలయాభివృద్ధికి విరాళములీయ విజ్ఞప్తి చేయుచున్నాము.

## వృక్షసంపద పెంపు

మానవ జీవితముపై వృక్షముల ప్రభావము విస్మరించరానిది. ప్రజావసరాలకు విశేషంగా చెట్లను కొట్టివేస్తూ, వాటికి బదులుగా మరల మొక్కలను నాటి చెట్లను పెంచకపోయినచో రానున్న తరాలవారికి జీవిత సౌలభ్యానికి ముప్పు వాటిల్లగలదు. ప్రజల ఆహారపానీయాలకేమి, ఆరోగ్య సౌభాగ్యాలకేమి, గృహనిర్మాణము యిత్యాది అవసరాలకేమి అవసరమయిన వృక్ష సంపదను పెంపుచేసికోడం అత్యవసరము. ఇందుకు ప్రభుత్వము వెచ్చించే మొత్తాలు సద్వినియోగమయి, ప్రజలు ఆసక్తితో వృక్ష సంపద పెంపు చేయడం అత్యవసరము.

## విద్యాభివృద్ధి

మద్రాసు ప్రభుత్వము ఉచితముగా నందరికి ప్రాథమిక విద్యావసతులను సమకూర్చాలని యోచిస్తున్నది. శ్రీమతి దుర్గాబాయ్ దేశ్‌ముఖ్ రెండవ పంచవర్ష ప్రణాళికాంతిమ దశలో లక్షన్నరమంది ఉపాధ్యాయులు అవసరం కాగలరని ప్రకటించారు. అయితే యీనాడు విద్యా సంస్థలలో సరిదిద్దవలసిన లోటు పాట్లలో అవసరాల కనుగుణ్యంగా ఉపాధ్యాయులను నియమించి, ప్రోత్సహించడం ముఖ్యం.

## సంస్కృత భాషాభ్యాసం.

మన జాతీయత మీదనేకాక అంతర్జాతీయ సారస్వత విజ్ఞాన సంస్కృతులపై నయితముగల సంస్కృత భాషా ప్రభావము అపారమైనది. అట్టి సంస్కృతభాషను నిర్లక్ష్యముచేయడము ప్రతి భారతీయుని ఆత్మ విధ్వంసకము లాంటిది.

జాతీయ సారస్వత విజ్ఞాన రంగాలలో ప్రతియొక్క భాషపైన సంస్కృత ప్రభావమున్నది. వేద, పురాణ యుగాలనుండి యీనాటివరకు అన్ని రంగాలలో వెలుగుబాటలు చూపి విజ్ఞాన సంస్కృతులను రూపొందించినది సంస్కృతము.

ఈ సంస్కృతమును ప్రతి భారతీయుడు అభ్యసించవలసిన అవసరం ఎంతైనాయున్న సమయంలో ఉన్న అవకాశములను సద్వినియోగంచేసికొని సంస్కృత భాషాభ్యాసమునకు బాలబాలికలను ప్రోత్సహించాలి.

సంస్కృత భాషను జాతీయావసరాలకు ఎంత ఎక్కువగా వినియోగించుకుంటే అంత మంచిది.

## ఆంధ్ర ప్రదేశ్ ఎగువ శాసన సభలో మహిళా ప్రతినిధులు

ఆంధ్ర ప్రదేశ అసెంబ్లీనుండి ఎగువ శాసన సభకు ఎన్నికయయిన శ్రీమతులు భారతీదేవి రంగా, ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మ, ఫెయిజ్ ఉన్నీసా బేగంగారలను, గవర్నరుగారిచే ఎగువ శాసన సభకు నియమించబడిన శ్రీమతులు కడప రామసుబ్బమ్మ, ఇల్లిందల సరస్వతీదేవిగారలను హృదయ పూర్వకంగా నభినందిస్తున్నాము.

ఈ మహిళా ప్రతినిధులలో రాజకీయ, సాంఘిక, సారస్వత రంగాలలో విశేషంగా కృషి. సేవ చేసినవారుండటం గమనార్హం. వీరి ప్రాతినిధ్యం జాతీయ పురోభివృద్ధితోబాటు ముఖ్యంగా ఆంధ్ర మహిళాభ్యుదయ పురోభివృద్ధులను తీర్చి దిద్దగలదని ఆశిస్తున్నాము.

---

## శ్రీ విళంబినామ సం॥ర ఆషాఢ, అధిక శ్రావణ మాసములు

| | | | |
|---|---|---|---|
| | 16 | బు | ● అమా 45-28 పున 60-0 |
| | | | **అధిక శ్రావణ మాసము** |
| జూలై 1958 సం॥ | 17 | గు | శు పా 42-24 పుష్య 59-3 |
| | 18 | శు | విది 39-34 ఆశ్రే 57-29 |
| | 19 | శ | తది 36-17 మఖ 54-50 |
| | 20 | ఆ | చ 29-46 పుబ్బ 51-5 |
| | 21 | సో | పం 24-33 ఉఫ 48-27 తిథి ద్వయం |
| | 22 | మం | ష 18-22 హస్త 43-19 |
| | 23 | బు | స 12-18 చిత్త 39-3 |
| | 24 | గు | అ 6-2 స్వాతి 34-58 |
| | 25 | శు | న 0-4 ఏవ్యం 54-21 విశా 31-14 |
| | 26 | శ | ఏ 49-26 అనూ 28-0 |
| | 27 | ఆ | ద్వా 45-23 జ్యే 25-33 |
| | 28 | సో | త్ర 42-14 మూల 24-2 |
| | 29 | మం | చతు 40-36 పూషా 23-47 |
| | 30 | బు | ○ పౌ 39-18 ఉషా 24-0 |
| | 31 | గు | బపా 39-46 శ్రవ 25-47 |
| ఆగస్టు 1958 సం॥ | 1 | శు | విది 41-20 ధని 28-44 |
| | 2 | శ | తది 44-1 శత 32-35 |
| | 3 | ఆ | చ 48-6 పూభా 38-7 త్యాజ్యాభావః |
| | 4 | సో | పం 52-27 ఉభా 44-11 |
| | 5 | మం | ష 57-46 రే 50-37 |
| | 6 | బు | సప్త 60-0 అశ్వ 56-37 |
| | 7 | గు | సప్త 3-0 భర 60-0 |
| | 8 | శు | అష్ట 7-19 భర 3-15 |
| | 9 | శ | నవ 11-0 కృ 8-34 |
| | 10 | ఆ | దశ 13-40 రో 12-57 |
| | 11 | సో | ఏకా 15-10 మృ 19-10 |
| | 12 | మం | ద్వా 15-18 ఆర్ద్ర 18-6 |
| | 13 | బు | త్ర 14-13 పున 18-46 మాస శివరాత్రి |
| | 14 | గు | చతు 12-2 పుష్య 18-16 |
| | 15 | శు | ● అమా 8-34 ఆశ్రే 16-34 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.



కేసరిగారి జన్మ దినోత్సవంలో గృహలక్ష్మి స్వర్ణకంకణ గ్రహీత శ్రీమతి దేవరాజు భారతీదేవిని
శ్రీ పి. వి. పుల్లయ్య పరిచయము చేస్తున్న దృశ్యము.

Lodhra Press, Madras-14.